అంత ప్రాచీముఖమ్ముగా నరుగు మనస్సు
ప్రణయినీకరకోమల స్పర్శచేత
పులకితం బయి యాహారహాపుష్టి గాంచు
వకుళభూమీరుహంబు గాన వచ్చు నీకు.

అపుడు స్వాగత మను మదీయానురాగ
భాజనం బైన వకుళభూమిజశాఖ
లలితముగ నూఁగు మస్తకలాపకాంత
శ్రవణసుభగమ్ముగా వల్గు సజ్జమునను.

కడచి యంగణరమ్యభాగమ్ము గొనను
చెల్లెలా, జామిచెట్టు గాంచెదవు సుమ్ము,
దానిపైనున్న శుకము నీదర్శనమున
రక్తికంఠమ్ముతో శ్రీనారమ్ము పలుకు.

పార్శ్వమందు నారోహణాసక్తి యమరు
భామినీభ్రూమనోజ్ఞ రూపమ్ముతోడ
స్నిగ్ధ చంద్రాశ్మఫలక వినిర్మితంబు
సస్పష్టమిత సోపాన సంయుతంబు.

అచటిరమణీయకక్ష్యయం దామె యుండు,
సంశయము లేదు. నీచనుసమయమునకు!
కోయుచుండును ప్రియజపాకుసుమములను
విస్తృత విపులవాతాయన వీథినుండి.

అట్లు కాదేని మృదులపటాసనమున
వాలియుండి మదీయకావ్యమ్ము కేల
బట్టుకొని యామె యుద్రిక్తభావయగుచు
చదువుచుండును కాకలీస్వరముతోడ.

కానిచో నామె తోరణస్తంభదరిని
ధవళిమోజ్జ్వల పర్యంకతలముమీద
బండుకొనియుండి నాచిత్రపటమువంక
జూచుచుండును నిష్పందలోచనముల.

ఆమె యొకవేళ రమ్యవేత్రాసనమున
గూరుచుండి సూచికలతో గూర్మిమీర
నాగదాకరము ను మన్నామధేయ
మల్లుచుండును కౌశేయకాంచలమున.

ఇట్లు కాకున్న వీణ వాయించుచుండు
కంకణారవమ్ము గీతిలో గలసిపోవ
కర్బుర మనోజ్ఞ మగురత్నకంబళమున
స్నిగ్ధహస్త్యాసనాంబుజాత యాసీన యగుచు.

కరతలాబ్జ సమర్పిత గండభాగ
అర్ధమీలితనయనయు నై యనేక
విధములు న్నన్ను గూర్చి భావించుచుండు
గోలు జాలివిషణ్ణమై పూర్ణహృదయ.

మందయానముతోడ తన్మందిరమ్ము
జేరి సోపానపాళికాశ్రేణివెంట
నరుగులోనికి నిను గాంచినంత నామె
సంస్మరించు పురాతనపరిచయమున.

జీవితేశ్వరి నిను సుఖాసీన జేసి
ఆదరముతోడ భాషించునవసరమున
నాయుదంతంబు మిగుల విన్నాణముగను
ప్రియమధురరీతితో దెల్పెట్టు మమ్మ!
ప్రీతితోడ దరస్మిత పెనగొనంగ
ఆమె నీభాషణంబుల నాలకించు
నీసుధారసనిష్యంది నిస్స్వనమున
తెలుపుమామెకు ప్రణయసందేశమిట్లు:—

జీవితేశ్వరి, యేల జాలము
చేయుచుంటివో తెలియదయ్యో!

వివిధచింతలతోడ నామతి
వికలమై పోయెన్!

ఈర్ష్యచే, నీతోడ నాపై
నెవ్వరేని నిరాపనిందలు
సృష్టిచేసి యనేకభంగుల
చెప్పలేదుగదా ?

హేయభావము నీకు నాపై
నెట్టులేని జనింపజేయఁగ
ఖలులు నీతో నెన్ని నోనియు
కల్లలాడరుగా ?

మధురవాక్యము లెన్ని నోనియు
మత్సమీపమునందు బల్కుచు
చాటుగా నపకృతియె సల్పెడి
జనము కలదుసుమీ !

నిష్కలంకవు సరలహృదయవు
నీవు లక్ష్మి, నిక్కువంబుగ :
ఎల్లరును నీలాటివా రని
యెంచబోకు సుమీ !

అన్యవాక్యము లెంతమాత్రం
బాలకింపక ధీరవృత్తిని
నన్ను బ్రేమను జూతు వనియే
నమ్మియున్నాడన్ !

ఎల్లవేళల నీవు లక్ష్మి,
హృదయనాథునిగా దలంతువు
నన్ను నిశ్చలబుద్ధితో నని
నమ్మియున్నాడన్ !

కొంతకాలమునుండి లోచన
కువలయమ్ములు లక్ష్మి, తావక
వదనరోచిర్విరహితము లై
వాడిపోయినవి !

ఐన నేటికి చూపు లిక ప్రియు
రాల, హృదయము లమలరాగ
ప్రబలసూత్రముతోడ దృఢముగ
బద్ధమై యుండన్ ?

కాలయాపన మగుటచే ని
ష్కారణమ్ముగ, గుండె తరిగెడి
భూరిఘోర నిరాశ యొక నెప
పొడముచుండు సుమీ !

నీస్వరూపము నాయెడందను
నిండియుండుట జేసి లక్ష్మి,
అన్యవనితకు తావు లే దీ
యంతరంగమునన్ !

ప్రియతమా, నే నిన్ను నూతన
ప్రేమపూర్ణ విలోచనమ్ముల
నెదురుచూచుచునుందు నీకై
యెల్లవేళలను !

సాహసమ్మును నూమకీన
స్థైర్యగుణము గ్రహించియును నీ
వింక నేటికి జంకుచుంటివొ
యెరుగకున్నాడన్ !

విమలహృదయం బాదరంబును
విశదముగ గ్రహియించియును నీ
వింక నేటికి జంకుచుంటివొ
యెరుగకున్నాడన్ !

పారదోలు మధైర్యవృత్తిని
ప్రాణకాంతా, ధైర్య మూనుము :
వీరసతి వయ్యెదవు గేహము
వెడలి యరుదేరన్ !

కదలి రా ప్రియురాల, నీయా
గమనకాలమునందు యుష్మ
త్సరణి కవరోధంబు చేయగ
జాల రెవ్వారల్ !

రమ్ము మాణిక్యంపుబొమ్మా
రమ్ము నాబంగారుచిలుకా
రమ్ము రమ్మోరాజహంసీ
రమ్ము శీఘ్రముగన్!

పరిణయోత్సవ కాలమందున
పయనమగుదము ప్రాణకాంతా
భరతవర్ష విలోకనోత్సుక
భావభరితులమై.

వసంతులమై వివిధరమ్య
స్థలములందు విహారలీలలు
సలుపగల్గుదు మంతరంగము
శాంతి నొందంగన్.

కూర్మిమీర సౌఖ్యమ్ము నీకొన
గూర్చ నేను మెలంగుచుండగ
ఏవిధంబున నుందువో నిను
నెంచి చూడగదే!

ప్రణయినీ, నీ కమర నన్ను
ద్బాహు వృతధామంబుగా నీ
వెట్టిస్వాంతము లెపుడు కాంతుమొ
యెంచి చూడగదే!

మ్లాన మెరుగని కుసుమగుచ్ఛము
మాడ్కి నిరతము నాథుమస్తక
మండనంబై వెలయుదువు సుకు
మార భావమునన్.

సాహచర్యముచేత ప్రతిభా
శాలినీ, కవితామృతము నీ
విమలవాక్కున లీలమై నా
విర్భవించు జుమీ!

గానకవితా శిల్ప సులలిత
కళలతో నొప్పారి యస్మ
న్నవ్యగేహము కేవలం బా
నందధామ మగున్!

విశ్వగాయకవరాళి కృష్ణుని
వేణువటు మనజీవనమ్ములు
దివ్యగాన తరంగములలో
తేలియాడు జుమీ!

అన్నివేళల నాదరించుచు
నఖిలవిధముల మేలు చేయుచు
మిగుల నను ప్రేమించుచుండెడి
మిత్రు లున్నారు.

అందు నస్మత్ప్రాణసము లగు
నాప్తు లెందరొ కలరు: వారలు
కవులు, సంకీతము లిత్తురు
కావ్యబంధములన్.

అమలహృదయముతోడ నాసుఖ
మభిలషించెడి స్నిగ్ధశిల్పులు
మధురముగ చిత్రింత్రు నిముఖ
మంజురూపంబున్.

సరససారస్వతము లక్ష్మీ,
సఖులచే ననివారితంబుగ
నిన్ను గూర్చి యనేకరీతుల
నివ్వటిల్లు జుమీ!

రమ్ము రమ్మోకమలనయనా
రమ్ము రమ్మోచంద్రవదనా
రమ్ము రమ్మోముద్దుగుమ్మా
రమ్ము శీఘ్రముగన్!

ఎల్లవేళల నీదురాకకు
నెదురుచూచుచు యుగములట్టులు
కఠినవైఖరి వాసరంబులు
గడపుచున్నాడన్!





నిడుదవోలు వేంకటరావుగారు, బి. ఏ.


ఆంధ్ర వాఙ్మయమునఁ బ్రామాణికాగ్రగణ్యులుగ నెన్నఁదగిన కవిత్రయమువలెనే, శైవమత వాఙ్మయమునఁ బండితత్రయమనఁ బేరుపొందిన ముగ్గురు మహనీయులు గలరు. వారిలోఁ బ్రథముఁడు శ్రీపతిపండితుఁడు; రెండవవాఁడు శివలెంక మంచనపండితుఁడు; మూఁడవ వాఁడు మల్లికార్జున పండితారాధ్యులు. వీరు ముగ్వురును సృష్టిస్థితిలయకారక త్రిమూర్తులును, పురాణ ప్రసిద్ధులగు సత్రియాచార్యుల శైవధర్మము బోధించి, శివుఁడే పరదైవ మనియు, జగత్ప్రవర్తనాకారణమునకు శివుఁడే హేతుభూతుఁ డనియు, సిద్ధాంతముచేసి వీరశైవమతము నాంధ్రదేశ మున సుస్థిరముగ లక్ష్యముగ నెలకొల్పిన మహానుభావులు. ఈవిష యముఁగూర్చి పాల్కురికి సోమనాథకవి తనపండితా రాధ్యచరిత్రమునఁ దిట్లు చెప్పియున్నాఁడు:

"ద్వి. శివునకు నుత్పత్తి కర్తనా బ్రహ్మ
నడి బ్రహ్మమును బ్రహ్మవాదులఁ ద్రుంచి
హరు భక్తియుత్పత్తి కధిపతిఁ గాఁగ
బరఁగెఁ దాఁ దొల్లి శ్రీపతిపండితయ్య
స్థితికర్త హరి నుమాపతికి మ్రొక్కించి
క్షితి విష్ణువాదులఁ గీటణఁగించి
చెనసి భక్తక్రియాస్థితి కర్త యనఁగఁ
జనియెను లెంక మంచనపండితయ్య
గాఢమై సంహారకర్తయ యనుచు
సాధారణముగ నీశ్వరుఁ బల్కు భక్తి
దూరాన్యసమయసంహారుఁడై చని మె
సూరుంపు మల్లికార్జునపండితయ్య
ఖ్యాపితభక్తికిఁ గారణపురుషుఁ
డై 'పండితత్రయం'బన భువిఁ జనియె
తనరు నీపండితత్రయములో మాన్యుఁ
డనఁ దొప్పు మల్లికార్జునపండితయ్య"

— పండితా. చరిత్ర, ప్రకరణము.

ఇట్లు నాముగ్గురి కాలమునందు సుమారుగా క్రీ. శ. 12వ శతాబ్దమునకే పండితత్రయమను వాడుకయున్నట్లు పైగ్రంథములవలన స్పష్టమగుచున్నది.

## శ్రీపతిపండితుఁడు

ఇతని నివాసస్థలము తెలుఁగుదేశమునందలి ప్రాచీనప్రసిద్ధపట్టణములలో నొకటియగు విజయవాటిక (బెజవాడ). ఇతఁడు పండితత్రయములోఁ బ్రథముఁడు. ఇతఁడు శివుఁ డొక్కఁడే దైవమనియు, నొక శివభక్తునితోఁ గోటిబ్రాహ్మణులైన సరిగారనియు, నిప్పులు కొంగున మూటఁగట్టి శివభక్తిమాహాత్మ్యముఁ జూపించిన మహనీయుఁడు. ఈవిషయమే పండితారాధ్యుల శివతత్త్వసారమునందును, శివభక్తివిజయమునందును నిట్లు ప్రశంసింపఁబడినది.

క. ఒక్కఁడె దైవము శివుఁ డని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు చీరన్
స్రుక్కక శ్రీపతిపండితుఁ
డక్కజముగ విజయవాడ నల జమ్మిశివా!

క. అతులిత శివభక్తునితోఁ
బ్రతిసేయఁగ రాదు కోటిబ్రాహ్మణులని శ్రీ
పతి పండితయ్య నిప్పులఁ
గుతుకమతి మూటఁగట్టెఁ గొంగున శివా!"

ప్లేటు ౨౭



శ్రావస్తియొక్క సింహద్వారము





బుద్ధాలయము. (జేతవనము)

శమదమోత్కృష్ట నిష్ఠాగరిష్ఠుండు,
అంతర్బహిర్ధ్యాన యజనవంతుం డ
వాంతరయ్యాయనంగ హారగణాఢ్యుండు,
వాదిశిష్యుండు దుర్వారసంసార
దూరసీర ప్రతోద్ధర నర్తనుండు,
శైవధర్మోత్తమాంచార్యుండు సకల
దైవంబు నద్వైత తత్త్వవేత్తృగుండు
న్యాయవైశేషికోదాత్త శాస్త్రను
పాయదర్శన పరిపాలన క్షముండు,
స్వకులంనలోకనోత్తారి శిష్య
నికరసుపుత్రయానికేశేంద్రయుండు,
తంత్రాగిగానిరితంత్రి సుతంత్ర
మంత్రాసగాతిరాజమంత్రసిద్ధుండు
వేదవేదాంత వివిధపురాణ
పాదిత కేవలభక్తిసద్ధనుండు
పండితవతపాదపద్మండు, సుకవి
మండలివిబుధ సమాజపూజితుండు
ఆరూఢి గీర్తితుండగు కోటిపల్లి
ఆరాధ్యునంగ లోకారాధ్యమూర్తి
అసమానదీయలోకారాధ్యశిష్య
విసరాగ్రగణ్యుండు వీరవ్రతుండు
తాను 'సరుద్రో నాత్ర సంశయో' యనంగ
జనియించినట్టి సాక్షాద్రుద్రమూర్తి
పశుయోగవాదాది పరవాది విసర
విశసన ప్రత్యక్ష వీరభద్రుండు
పండితాఘుండు, జగత్పావనకార
ణుండు విస్తృత జగన్నుతసితకీర్తి
అధికశాపానుగ్రహసమగ్రబలస
మన్విత దర్వాంచాకృతివేత్త
వాకదూరాకాసీకవాగ్బంధనక్రి
యావిశారదుండు, లోకారాధ్యమూర్తి
పరగి 'శైవే దశ ప్రత్యయా' యనగ
పరువడి జను దశప్రత్యయాన్వితుండు
ధన్యుండు, దేశికోత్తముండు, లోకైక
మాన్యుండు, పండిత మల్లికార్జునుండు"

(పండితారాధ్యచరిత్రావతారిక)



# ప్రేమ

('స్కాట్' మహాశయుని పద్యఖండమున కనువాదము)

బాలాంత్రపు సత్యనారాయణరావు గారు

విమలమగుప్రేమము ప్రశాంతిసమయమం
గొల్లబోయని పిల్లనగ్రోవి నూదు [దు
రౌద్రభూయిష్ఠఘోరసంగ్రామ మందు
ధీరుడై పోరు యోధుని తేజి నెక్కు
లచ్చి నృత్యంబు గావించు రచ్చలందు,
కమ్రవసనాదిభూషల గానవచ్చు
పామరజనంబు నివసించు పల్లెలందు
నవ్యశాద్వలభూముల నాట్యమాడు
ప్రేమయే శిబి రాష్ట్రాన సీమ లేలు!
ప్రేమయే భువి మానవధామ మేలు!
ప్రేమయే దివి దేవతాధామ మేలు!
ప్రేమస్వర్గంబు, స్వర్గమే ప్రేమ మరయ!




పిడుమర్తి సత్యనారాయణమూర్తి గారు, బి. ఏ. [సారస్వత సమాజము]

శ్లో. సర్వథా వ్యవహర్తవ్యం కుతో హ్యవచనీయతా,
యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః.

—భవభూతి.

ఆంధ్రభాషా చరిత్రమున నేడొక నూతనాధ్యాయ ప్రారంభ మగుచున్నది. ప్రాచ్య ప్రాచీనున్న రీ గలుగునై పరీక్ష్యము తెల్లను సేయను నాచరించుచున్నవి. ఇంతవరకును మనకవులు సంస్కృతమునందు వివరింపబడిన సాంప్రదాయములను శిరసావహించి పనిచేసిరి. కాలము గతించినకొలదిని మార్పులు రాకతప్పదు. మూడు శతాబ్దములు నిరాఘాటముగ సాగినప్రబంధముల పలుకుబడి సన్నగిల్లినది. స్వేచ్ఛయెడ అభిమానము హెచ్చుటయేకాక ప్రాచీనసాంప్రదాయములయెడ గౌరవము తగ్గెను. అందుచే ప్రాచీనసాంప్రదాయానువర్తులకును స్వేచ్ఛానురాగులకును సంఘర్షణము సంభవించినది. ఇట్టిసమయమున జిందిపడిన నెరుసులలో నీకృష్ణపక్ష మొకటి.

ఇది భావకవితాలతపై పూచినపువ్వు. దీనినే యాంగ్లమున 'లిరిక్కు' అనియందురు. ఆంగ్లమునందలి భావకవులలో నలువురు ముఖ్యులు గలరు. వారు బైరను, షెల్లీ, కీట్సు, వర్డ్సువర్తుఅనువారు. బైరనువాణి యుద్ధృతశక్తి సమన్వితమైనది. సంఘముచేసెడి దురంతకార్యముల నతడు ప్రళయఝంఝానిలప్రేరితోత్తుంగ తరంగగంభీర భీషణములైన భాషణములలో వెలువరించి ఆంగ్లభాషను, తనభావములను అమృతములుగా నొనర్చెను. షెల్లీ కూడ బైరనువలె సంఘముయొక్క నికృష్టకార్యముల సేవగించి కష్టపరంపరలకు లోనయ్యెను. ఈతనిభావములు ఆకాశమధ్యమున కెగిరిపోయి పంచభూతములందును లీనమై మధురగానముగా ప్రసవించినవి. కీట్సు ప్రకృతియొక్క సౌందర్యభావము నుపాసించి పురాణముల నొప్పుగానము సాగించి యమరుడయ్యెను. వర్డ్సువర్తు సామాన్యులసుఖదుఃఖములనుండి తన యితివృత్తములనేరి తీసికొని వానికి ఎలయు సందర్భముల నిర్మించి నిత్యజీవనమునందు నవ్యత్వమును గాంచెను. ఈనలువురును జీవించినకాలమున ... జనుల కుపకారము చేసిరి. ఆంగ్లేయులందరు వారిని పోలువారు నే మనియుంచలేరు. ఇప్పటివారు అట్టి మహాపురుషుల ననుగమనమునకై ఎల్లరు స్వాగతోపచారములను సలుపుచున్నవారు మాత్రమే.

భావగీతములందు వస్తువొక్కటియభిప్రాయముపై నాధారపడియుండును. పురాణములందును, ప్రబంధములందును కవికిని పాఠకునకును మధ్య పాత్రములు కొన్నినిలచి కవియొక్క భావములను పాఠకునకుఁ దెలియజేయును. అందుచే నాగ్రంథములందున్న యభిప్రాయములలో నేవి కవియభిప్రాయములో యేవిపాత్రలయభిప్రాయములో మనము సులభముగ గ్రహింపలేము. వానియందు కవి ప్రచ్ఛన్నుడై యుండును. భావకవిత్వమునందు కవి పాఠకునితో ప్రత్యక్షమైయేకవచనమున ప్రసంగించును. మానవ నాతడు తనయాంతరంగిక వర్గములో జేర్చికొని తనసుఖదుఃఖములను మనకు జెప్పుటయేకాక తన జీవితమునందలి సూక్ష్మవిషయముల నన్నిటిని మనకు జెప్పుచుండును. అందుచే నీతని కవిత మనకు బూర్తిగ నర్థము కావలెనన్నచో కవియొక్క జీవితము మనకు తెలియవలెను.

ఈగ్రంథమును రచించిన కృష్ణశాస్త్రిని నేను స్వయముగ నెరుగుదును. సంఘమునందున్న దురాచారములకు

వందజాలని భావప్రకటనము విశ్వాసార్హము (sincere) కాకపోవుటచే ఉత్తమకవితాలక్షణము కాజాలదు. ఒకయూర్పునసే రెండుపుటలదూరమైనను లేకుండగనే

రాజరాజేశ్వరులకు నలభ్యమైన
సదమలామూల్య తారకాసదృశదివ్య
మణివిరాజిత కల్యాణమకుటరాజ
మిడితి నామస్తకాన;

అనియు (పుట 75)

కంటకకిరీటధారినై, కాళరాత్రి
మధ్యవేళల, జీమూతమందిరంపు
గోలుపుకూటాల, నేకాంతగోష్ఠిదీర్చి.

(పుట 71)

యుందుననియు వ్రాయు సందర్భమేమి! పైన చెప్పినట్లు ఏదో యొక భావప్రాబల్యము లేకపోవుటే దీనికి కారణము.

దీనిని బట్టి చూచినచో నీకవికిగల స్వేచ్ఛాభిలాష యెంతవరకు నిజమని యాలోచింపవలసియున్నను. నేటి కవులందరును స్వాతంత్ర్యాభిలాషుల మని కంఠమెత్తి-తో జాటుచున్నారే. కాని వీరు చేసిన సాహసకృత్యము లేమి? పరతంత్రములనుండి మనదేశమును విడిపించుటకు వేలకొలది నాయకులు ప్రబలియున్న దురాచారములను, అస్పృశ్యతా సముదాయమును, ప్రతిఘటించి వీరుడై నిలిచినవారు చాల అరుదుగా నున్నారు. బైరను షెల్లీలవలె తమ యభిప్రాయ ప్రకటనము కొరకు భౌతికసుఖములను, సర్వసంపదలను త్యజించి మాతృదేశముకొరకును మానవకోటికొరకును ప్రాణసమర్పణముచేసిన కవులును మనయందు ఒకరిద్దరి కంటె లేరు. మరి వీరిస్వాతంత్ర్య మెట్టిది? తెలియుట లేదు. తొంబదిమూరు పుటలుగల యీగ్రంథమునందు వీరరసప్రధానమగు నట్టివి గాని, అణచివేయుటకునలను గాని వీరునియాత్మికకష్టపరంపరా భారమును ఓర్పుతోను, శమముతోను సహించి తనయందలి దివ్యగుణమును ప్రకటింప విజయముతో బయికివచ్చు ఘనమగు విషయముగాని లేదు. మరి యీ స్వేచ్ఛాభిలాష యెట్టిది?

కవిత స్త్రీవంటిది. రెండును కోమలములు, పవిత్రవంతములు. స్త్రీకి సౌందర్యము భగవత్ప్రసాదితము. అతని దయవలనవచ్చిన యాసౌందర్య మలంకారాదుల వలన నెక్కువ చేయవచ్చును. ఈ రెండవది మానవునకు ప్రయత్నసాధ్యము. అటులే కవితకు భావము ముఖ్యము. అది తెచ్చుకొనుటకు కష్టమైనది. పవిత్రమగు జీవనము వలనను, తపస్సువలనను వీనిరెంటిని మించి భగవంతుని దయవలనను సాధ్యమగునది. ఆభావమునకు మనోహరమగు రూపమునిచ్చునది భాష. ఇయ్యది సాధనచేసాధ్యమగునది. కొందరు తలచినట్టుల భావమునుబట్టి భాష వచ్చుననుట పొరపాటు. భాష సాధనచే సాధ్యమగును. మహాకవి తిక్కన భాషయందు లేని మృదుత్వము తిమ్మనయొద్ద చేరినది. రామరాజభూషణుని భాషలో మోహనకరమగుధ్వనియున్నది. వారి భావములు మాత్రము సామాన్యములు. చిన్మయత్వము జెందు స్వప్నపిపాసల దిరుగాడి యానందముతో వారు మాటాడలేదు. మాటలాడ లేకపోయిరి.

కృష్ణశాస్త్రి వాడిన భాషయందు కొంచెము సాధన గోచరించుచున్నది. మన భావకవులలో చాల మంది రెంటికిని చెడిన రేవళ్లగుచున్నారు. చదువరుల మనస్సు రంజిల్లజేయగల భావములను వారికి భగవంతుడు ప్రసాదింపలేదు. కాని లోపల యుబలాటము లావుగ నుంటచే వారు ముద్రణాలయమును ప్రవేశించవలసిన దురవస్థ ప్రాపించుచున్నది. అట్లని వారు భాషావైపుణ్యము నైన జూపగలరా? లేదు. ఆ విషయమున దగు సాధన యుండదు. వారి చేతకానితనమునకును, సోమరితనమునకును మాత్రము మనము బాధపడుచున్నాము. శాస్త్రి యీ తెగకు జెందడు. ధ్వనిగల కవిత యితనిది. కాని యిందు భావస్ఫురణము తక్కువ. రాయప్రోలు సుబ్బారావు వలె

ఎండిన బీళ్లయందు నుద
యించిన పచ్చిక కండ్ల పండువై
యుండగ జూడియాలు తల
లూపుచుబోయెడి; క్రొత్తనీటిచే
నిండె తటాకగర్భములు
నిష్కుటము లిక్షుశ్యామలంబులై

మెండుకొన నవ్వనీలమొగిలు
మీసె ప్రభాతములందు కొండలక.

అనునట్లు 'మాడిపోలు' 'క్రొన్నురుగు మీగడ తెప్పలు' మొదలగు పదముల ప్రయోగముచే చదువరియందు వివిధములగు భావముల నుదయింపజేసి యానందము పుట్టించు శక్తి యితనియందు దక్కున. కాని యితని పదముల పొందిక గంభీరమైనశైలితో నిండి చదువరి నీచివరనుండి యాచివరకొక్కయూపున గొంపోవును. చూడుడు:

అమృతగాన
మధురిమమందాకినిభంగ మాలికాంబు
శీకరవితానమోహన చిత్రనటన
మెన్ని యెన్ని రీతుల జూపుచున్నవారో?

*    *    *    *

ప్రాజ్యపీఠపురీ మహారాజ్య భాగ్య
లక్ష్మి కొలువుదీర్చు చిరత్నరత్నఖచిత
భాసమానకల్యాణ సింహాసనమ్ము;
అది వెలమ శౌర్యమూర్తి రణావనీవి
హారవిక్రమ కేళికానంతరమ్ము
శాంతినుండు విలాసవిశ్రామవేది;
అది సభాసీనసకలబుధావతంస
ఘనకవీశాన విజ్ఞానకాంతి మత్స్వి
సన్న వీక్షణస్నాపిత స్వర్ణపీఠి;
అది మహీపతి రామరాయావనీంద్ర
కరకమలవీజ్యమాన చామరసమీర
పులకిత భవన్మృదుశరీరభూషితంబు.

(పుట 90)

వికృతక్రూరక్షుభిత మృత్యుకఠోర
వికటపాండురశుష్క వదనదంష్ట్రాగ్నిలో
నవ్వేలా?

(పుట 64)

కాని వీనియర్థ మేమి?

అవసరమైనపుడెక్కడికక్కడ విరిగిపోయి అర్థమును సులభగ్రాహ్యముగను హృదయమునకు దట్టునట్లును జేయగల చిన్నిమాటల నుపయోగించుటకూడ నితనియందుగలదు.

కరము కరమున గీలించి కలసిమెలసి
మన్న సహధర్మచారిణి, మధురమధుర
మూర్తి, ప్రియురాలు, సఖురాలు, పూర్ణ
[రాగ
కలిత, నాదుఃఖ మనువులే తొలగిపోవ
వీడిపోవునే మోయను వెరపువలన
నాకు మరణమ్మువలదనినాను;—

పుట 91.

చూచితిరొ లేదొ చిన్నికృష్ణునిసొబంగు(?)
పెదవి చివురునంజల నరవిచ్చునవ్వు
వెన్నెల, చలించు తుమ్మెద బెళుకుచూపు,
లోలపవనచాలిత కుటిలాలకమ్ము.

పుట 90

ఈతని శైలి సరళముగను మృదుమధురముగనున్నది. ఇట్టిసారళ్యము నేమరి యెవరు చిత్తులైయుందురో కొన్నితావుల లంగు తెక్కువరకు పు శయ్యను వాడి రసభంగము చేయుట కూడ నీతనియందుగలదు.

ప్రావృడంభోధరస్వామి, జీవనంపు
భారము తొలంగిపోవ నవ్వారి కేని
కోరి నీసొదలను జెప్పికొందునేమొ [వేళ.
గొణుగుకొనుచుందువయ్యొ యొక్కొక్క

(పుట 65)

ఎదకరగునట్లు సన్ననియెలుగుతోడ
నట్టె తలలెత్తి పాటకూ కొట్టు చేద్దు
గౌతమీవీచికాళి నగంబు నిదుర;

(పుట 96)

ఈపైపంక్తులందుగల 'ప్రావృడంభోధరస్వామి', 'తలలెత్తి పాటహాకోట్టుచేద్దు' అనుపదములను 'ప్రాజ్యపీఠపురీ మహారాజ్య' అనుపదములతోఁ బోల్చినపుడు

'నక్కయేడ దివిజాధ్యనాకలయంబేడ'

అను తిరుపతివేంకటకవుల వాక్యము స్మరణకు వచ్చును. సహజసుందరమగు పదగుమ్ఫనమీతనికెరుకయే. దానినోపికతో సాధనచేసి రాణించునట్లు చేయవలెను. ఛందోవిషయమున పూర్వకవుల యాచారానుసారముగ యతిప్రాసములను వాడుచుండెను.

సకల గోపాలగోపికాగణముతోడ

(పుట 28)

ఆయుగమ్యాశమసాంద్ర యవనికాంత
రంపు టేకాంతమునఁ బడి యాక్రమక్రి
యాస్తమిత నూపురారావాహ్వానములను

(పుట 93)

అను చోటులందు యతి చెడరినది. బుద్ధిపూర్వకమో? ప్రమాదమో!

అర్థము పూర్తియైనచో పాదపూరణముకొఱకు వ్యర్థపదములనువాడక ఆపాదము నచటనే సమాప్తముగావించి యితడు క్రొత్తమార్గము నవలంబించెను. కొన్ని కొన్ని తావులందు సంగీతప్రధానముగ గీతములను వ్రాసెను. అవి బాగున్నవి.

చిన్నిపూవే వాడెనా
తన
కన్నెవలపుల వీడెనా
తన
చిన్నెలన్నియు వన్నెలన్నియు
మన్నులో గోల్పోయెనా?

(పుట 56)

కాని చెప్పినభావమునే మరల చెప్పుచుండుటచే నిందలి సొగసు చెడుచుండును. పైపద్యముక్రింద

కాంతు నెఱుగని కన్నెగాదా
సిగ్గువీడని మొగ్గగాదా

మొన్న మొన్ననె ముద్దువల్లిని
మొనలు దీరెనుగా!

యన్న దెందుకు?

ఇకజూడవలసిన దీతని ప్రేమవిషయము. ఇతని హృదయక్షేత్రమున ప్రేమోదయమైనది.

ఏల నాహృదయంబు ప్రేమించు నిన్ను?
మావిగున్నకొమ్మను మధుమాసవేళ
బల్లవము మెక్కి కోయిల పాడుటేల?
పరుల దనియించుటకొ తనబాగుకొరకొ?
గానమొనరింపక బ్రదుకగడనబోకొ

(పుట 38)

అని యడుగుటవలన అది నిర్హేతుకమును అవ్యాజమునని తెలుచున్నది. అది యుత్తమమైనది. కాని

క్రౌర్యకౌటిల్య కలుషపంకంబువలన [య్యో
మలినమానా హృదయముధామమెటు ల
నతివిశుద్ధము మధురము నఘరహితము
ప్రణయమునకంచు సందియపడుదువేమొ?
ప్రేయసీ! శర్వరీతమోవీథుల బడి
చందురుడు రాడె పూర్ణతేజస్వియగుచు;
అఘవిదూషిత మీాహృదయంబునందె
ప్రేమకోమలతమము పవిత్రమయ్యె.

(పుట 40)

అని ప్రశ్నించుకొని సమాధానపడుటజూడ నీతనిప్రేమ విషయ మారంభమున కాఠిన్యముతో గూడినదా యను సందియము వొడముడు. అదియునుగాక యీ ప్రేమకు నిధానము భగవంతుడా లేక స్త్రీయా యనుసంశయము కూడ కలుగుచున్నది. ఈగ్రంథమునందలి కొన్ని ప్రేమ గీతములను భగవంతునిపరముగ నన్వయముచేయవచ్చును. కాని

ఇదెవచ్చుచున్నాను ప్రియురాలా
ఇకనిలువలేను నాప్రియురాలా!

(పుట 94)




# అనార్కలి

రెండంకముల నాటిక.

విశ్వనాథ సత్యనారాయణ గారు

(నాంది)

నాసాంతే స్మృతసృష్టిదివ్యసహితా భ్రూన్యాసుసంచర్యాసనే
నిష్ఠామద్గిత బాహ్యవస్తునిచయా సూ బ్రహ్మరంధ్రోద్గతా,
తేజోభిర్భ్రమితైర్మయందహైః ప్రచలితైః సూర్యార్ధవైశ్వానరైస్సతే నాంగుళి
స్సన్గ్రథిత్యజహారిహేతు రసతాత్ శైవార్థపీఠంతిసః.

తేఁకుఁ దేవుడున్ మొలకతేరిన బత్తిని మత్పితృప్రతి
ష్ఠాపిత శైవలింగము గడంక భజించెద నాత్మ; వారణా
సీపురినేత భృంగిరిటిశిష్యుని దగ్వసనున్ త్రిలోక ర
క్షాంకృతి నందమూరుపురసత్తు మదశ్రుకణాళిహేతువున్.

అమృతపదార్థమున్ దెలిసినట్టిరు యోగులు తన్మనోంబుజ
భ్రమరము నన్మనీచరమభాగవిరాజిత బిందుశేఖర
స్థము పరతత్త్వమం చెఱుక చాలియు చాలక, చాలకే రఘూ
త్తమునిగ నెంతు మంత్రమహితాక్షరబద్ధసుమూర్తి నిత్యమున్.

శైవాంశం బని చెప్పనా! దశశిరస్సంత్రాసచండాకృతిన్
శ్రీవాయూద్భవు డందునా! అనిలు వంచించెన్ మహాయోగియై
పోవాఁ! కేసరికోతికూన యననా! ముక్తేంద్రియభ్రాంతు స
న్నావేశించిన రామచంద్రపదపద్మాధీనచేతస్కునిన్.

ఝణఝంఝణఝంఝణఝణ
ఝణాఝణాఝణమనోజ్ఞసంరావితకిం
కిణీపద సుమరద తాండవ
చణశారద మన్మనోఽచ్ఛజలధి మథించున్.

# పూర్వాంకము

## రంగము. ౧

ప్రదేశము - వసంతోద్యానము

ప్రవేశము - సలీము

ఆకన్నదో యిలో స్వర్గజ్యోతిస్సులు వెలుగుచున్నవి.

ఏ మాసౌందర్యము!

ఈమావిగున్న యింతి విరియఁబూయవలెనా!

నామనస్సే చిగురాకుమీదనే నిలుచుచున్నది.

[నిష్క్రమణం]

ప్రవేశము - అనార్కలి

నెమ్మదనెమ్మదిగవిచ్చు మల్లికాకుసుమము వలె మహాస్మహాన్నిప్రకృతి శోభాయమానముగ నున్నది!

శరత్పూర్ణిమా యామినివలె స్వచ్ఛముగానున్నది!

మక్కానగరగోపురమువోలిక స్వర్గశిఖరము తలపించుచున్నది!

అతని సౌందర్యమేమి!

[నిష్క్రమణ]

చిగురుకన్నె

మసృణ సంధ్యాకాల మధురకాంతులలోన
ఘుసృణమందార సంకుమదరోచులలోన
దాచుకున్నాను నాతరుణారుణచ్ఛాయ
వేచుకున్నాను నావిభునిరాకలదాక.

ముసలి సంజలతమ్మి మొగ్గమూతలలోన
కసటుప్రొద్దుటి లేతకలువవేపులలోన
నాకన్నెసిగ్గుటందము దాచుకున్నాను
నాకంఠమాల ప్రాణపతివచ్చెడుదాక

పసిలేడిచొక్కపు పాలబుగ్గలలోన
మసలని సెలయేటి నురుసుపువ్వులలోన
పదిలించుకొంటి నాప్రాయంపుమిసిమెల్ల
మదనమోహనుడు నామధువురాకలదాక

రేపు వచ్చును సామి మాపు వచ్చును సామి
యీపూట తప్ప దంచిన్నాళ్లు వేగగా
సౌందర్యమునకన్న సౌందర్యపుంగుప్ప
యిదె రానేవచ్చె నీమనోహరమూర్తి

రావమ్మ నవమల్లె రావమ్మ మాగధి
రావమ్మ మాధవి రావె శేఫాలికా
రావమ్మ పున్నాగ రావమ్మ మాకంద
రావమ్మ యిందీవరంబ ముద్దులగుమ్మ

రండు రండమ్మ పేరంటాండ్రు మీరెల్ల
పండువై మదనసుందరుడు రానే వచ్చె
న్యాయ సేకొనెడు పూజాద్రవ్యములు తెచ్చి
యేము కాచెదము రావే మోహనాకార.

వసంతుడు

ఇది యుషస్సతిమోము నదిమి కొన్నపరాగ
మిది సంజలేగటూ బొందుగుశోభారాశి
యిది పూవకన్నెలో పొదలు తేనెలవాక
యిది రసాంభోరాశి పదునుగొన్నకణంబు.

పుష్పకన్యకలు

ఇతడు మావిచిగుళ్ళ నెగచి వేసినజోదు
ఇతడె యందపుకోన లెల్ల మ్రుచ్చిలురాతు
సెలయేళ్ళయిసుకతిన్నెల నేలురా జితడె
ఇతడె ప్రాతఃకాల సతిమేన సితరోచి.

మాధవి

చేరిరారే ప్రదక్షిణముగా స్వామికి
మీరు కేల్కలువాని మేలికన్నియలార

యెన్నాళులకు వచ్చె నీదయౌవనరాశి
కన్నులవత్తులై కాగిపోతిఁగదమ్మ

మాగధి

పూవసంతాలమ్మ పూవసంతాలు
మావనాంతములందు మధులతాంతాలు
తల్లి క్రొంబొదుగువద్దకుఁ బోవు వసిలేడి
మెల్లగా చెంతు స్వామికి నాడుకొనుటకు

శేఫాలిక

కస్తూరికొనిరంతు కైవసంబయినాడు
శిస్తుపూయుదమ యీచిత్తేశు డీనాడు.

అందఱు

చిలుపవానలకు పరువులు పెట్టిన
సెలల యిసుకపొరలో
మొగలితావి పసబుగులుకొన్న పు
ప్పొడుల మేలితెరలో
కలసిగాడుదము పాటలుపాడుచు
మలగిపోవుదము వనిలో
జిలుగుపూ లెసగుపచ్చనిబయలులఁ
గలసిపోద మా మనిలో.

పుష్పకన్యకలు

బాలమృణాలీలీలకరా-మ
త్తాళిమనోహరనీలకచా!-స
మ్మోదవనీపుంకీకృత దేహా!
(నృత్యము)
చిలుపవానలకు పరువులు పెట్టిన
సెలల యిసుక పొరలో
కలసి పౌవుదము పాటలుపాడుచు
మలగిపోవుదము వనిలో.
(నృత్యము)

కవి

శ్రీఖండానిలగంధసంకలితమై
శేఫాలికామాధవీ
రేఖామంజులవాసనాలహరి ప
ర్వెన్ ప్రాతరాసీతశో
భాఖద్యోత విలాసరాగలలిత
ప్రాంశుప్రభన్ మూతిస
చ్ఛాఖాపల్లవరాజి కెంతయుఁ బరి
ష్వంగమ్ములై వాల్చెడిన్.

ఈమలయానిలయంబులు వ
హించిన శైత్యము లెంతధూర్తముల్
లేమలతాపమ్ములఁ బద
లించుకొనెన్ వమలోనమందమం
దామలయానవైఖరుల
కబ్బిన పాంథవిలాసినీమనః
కోమలతాపదంబులును
కున్ నడివేసగి పల్లవంబులై.

ఊరక నాహ్లాదంతపము
నూచెపుఁగోరిక లేకరక్త్వపుం
నీరజపత్ర కాంతులకు
నెయ్యములై తగుఫాల్గుణాంత వే
శారుచిరంబులై యుదయ
లాలితసవ్యవనీవసంతశో
భారమణీయమైన నవ
పల్లవరక్తిమ మెంతక్రమమో.

రంగము. ౨

మిత్రుడు

ప్రభూ! ఏమి విచారించుచున్నారు.

సలీము

మిత్రమా! అనార్కాళి యనగా నేమి?

మిత్రుడు

దానిమ్మపూవు.

సలీము

అది గులాబికన్న మల్లెకన్న రమ్యమైనదా?

మిత్రుడు

ఏపువ్వు కాపువ్వే. ఏపూవురమ్యత దానిదే.

సలీము

గులాబి మల్లెలలో వాని సౌందర్యమునకు వానివాసన సహాయకారి యగుచున్నది.

మిత్రుడు

వాసన లేకున్నను గులాబి మనోహరమైనదే.

సలీము

దాని వాసనచేత నిదివరకే సమాకృష్టమైన నీ హృదయము దాని యందలి పక్షపాతమును వీడ జాలదు. జన్మతః గల వాసనచేత గులాబిని మల్లెను మనము మిక్కిలి గౌరవించుచున్నాము. వానిని వాని వాసనకు గౌరవించుచున్నామేకాని వాని సౌందర్యమునకుగాదు. సౌందర్యముకూడ నున్నదా యుండనిమ్ము. వాసనా విరహితములైన ప్రసవములలోనున్న సౌందర్యము పక్షపాతముచేత మన మొప్పకొనునది కాదు. అనర్కాళి చూడుము. దాని రక్తిమ, దానిసౌందర్యము! నా మనస్సునంతకంతకు వశపఱచుకొన్నది.

మిత్రుడు

అవును ప్రభూ! తాము మునుపటివలె మావితోటలకు బోయి క్రొత్త యంట్లు కట్టుటను గూర్చి విచారించుట లేదు. శిల్పులను పిలిచి వారితో శిల్పప్రసంగములు చేయుటలేదు.

సలీము

నా మనస్సు ననార్కాళి యాక్రమించుకొన్నది.

మిత్రుడు

సరే! ఇంక దానిమ్మ తోటలు వేయించి యందు గూడ నొక క్రొత్తవిధమైన ఫలములు గనుగొనుడు.

సలీము

(హాసము)

మిత్రుడు

ప్రభువు లన్యాయత్తచిత్తులై యున్నారు.

సలీము

ఆమె యన్యకాదు. అవివాహిత.

మిత్రుడు

ఆమె యెవరు?

సలీము

అనార్కాళీ.

మిత్రుడు

స్వర్గవాహిని చవిటి పఱ్ఱల మీద బ్రవహించుచున్నది.

సలీము

ప్రేమ వాహిని వంటిది. దానికి నిమ్నోన్నతత్వములు సమానము.

మిత్రుడు

(హాసము)

రంగము. 3

అనార్కాళి

అజీజ్! ఇప్పు డెంత ప్రొద్దు వోయినది?

అ జీ జ్

రెండు ఝాము లైంది.

అనార్యాళి

నాకు నిద్ర వచ్చుట లేదు.

అజీజ్

ఏంచేత?

అనార్యాళి

మనస్సున నేదియో యాతావేదనగా నున్నది.

అజీజ్

దీనికో మందుంది చెప్పనా?

అనార్యాళి

ఊఁ.

అజీజ్

భరతపక్షి వుందే. అది గుడ్లుపెట్టి మేత కెళ్లినపుడు నెమ్మదిగా చెట్టుమీది కెక్కి, అందులో ఒకగుడ్డుకి చిన్న బెజ్జం చేసి, అందులో రసంఅంతా ఓడ్చేసి దాన్నిండా పాదరసం పోసి సోసం మొరగనట్టుగా దిగిరావాలి. తల్లి వచ్చి తనగుడ్లు సరిగానే వున్నవని సంతోషిస్తుంది. మనం పాదరసం పోశామని తెలియదుగా! అది తనగుడ్లను పొదుగుతుందా! మన పాదరసం గుడ్డునుగూడా పొదుగుతుంది. మన పాదరసంగుడ్డు పిల్లనిపిట్టవుతుంది. ఆపిట్ట యీకలుతెచ్చి అవికాల్చి బూడిదచేసి తేనెలోకలిపి పొద్దునా సాయంత్రం ఒకమండలం రోజులు సేవిస్తే యెటువంటిరోగం నిమిషంలో కుదురుతుంది.

అనార్యాళి

ఈమందు నీకెవరు చెప్పినారు?

అజీజ్

సారాదుకాణంవాడు.

అనార్యాళి

మరల నక్కడకు వెళ్లుచుంటివా? నేను వెళ్లవద్దని చెప్పితిని గదా!

అజీజ్

ఊరికే వెళ్తున్నాను. తాగడం లేదు. కాని తాగితేనేం? ఎంతో వుత్సాహంగా వుంటుందే.

అనార్యాళి

లోపల నరములును మాంసమును చెడిపోయి మృత్యువు శీఘ్రముగ తటస్థించును.

అజీజ్

ఇంతేగదా?

అనార్యాళి

ఏమట్లంటివి?

అజీజ్

చచ్చిపోతే బతికించడానికి నాదగ్గిర మందుందిగా.

అనార్యాళి

అదేమిటి?

అజీజ్

జెముడు కాకి వుందా, అది మేతకెళ్లినప్పుడు దాని గూడెత్తుకొచ్చి గంగలో పారేస్తే అందులో సంజీవిపుల్లని ఒకటుంటుంది. అది ప్రవాహాని కెదురీదు తుంటుంది. అది తీసుకువచ్చి చచ్చిపోయినవాళ్లకి ముట్టిస్తే అందరూ లేచి కూర్చుంటారు!

అనార్యాళి

నీకు చదువు చెప్పెదను. నేర్చుకొందువా?

అజీజ్

నాకు చదువుకోవాల్నే వుంది.

రంగము. ౮

రు సీ

అనార్కలీ! నీవు చాల యందకత్తెవు.

అ నా ర్క లి

రుసీ! నీవు చాల తీయని దానవు.

రు సీ

నీ యంత ప్రశస్తమైనదానను కాదుగా!

అ నా ర్క లి

అనార్కలి యనగా అనార్కలియే. రుసీ యన్నది రుసియే. ఇది పూవు. అది పండు.

రుసీ

పూవును కాయ కాచి పండు గాక యున్న యెడల పూవుగానే యుండునా ?

అనార్కలి

పూవు పూవు గానే మాడి పోవచ్చును.

అక్బర్

మాడి పోయినా పువ్వు పువ్వే. దాని వాసన నాలుగు దిక్కులూ గుబాళించి పోతై.

రంగము ౯

అనార్కలి

మిత్రమా ! మరల వచ్చితివి.

రుసీ

ఉస్తాదు మరల పంపించినారు.

అనార్కలి

అయ్యో నాకేమియు నోపికగా లేదు.

రుసీ

పాఠశాల చూచుటకు వచ్చునది యువరాజు సలీము గారట.

అ నా ర్క లి

(హాసము)

రు సీ

ఏ మందువు?

అ నా ర్క లి

ఏ యిష్టము.

రు సీ

తప్పక రమ్మని.

అ నా ర్క లి

అంత వరకు వచ్చినను నృత్యము చేయలేనేమొ!

రు సీ

నీవు వచ్చిన చాలునన్నారు ఉస్తాదుగారు.

అనార్కలి

గురాజ్ఞ బలవత్తరముగా నున్నది.

( కొంచె మౌనము )

రుసీ

స్నానమైనదా?

అ నా ర్క లి

ఆ.

రుసీ

దుస్తులను వైచుకొని కన్నులకు కాటుక దిద్దుము. ఇదుగో నృత్యశాల.

అనార్కలి

ఓపిక లేని నేను నృత్యము చేయుచున్నప్పుడు కాలుజారి పడెదనేమొ!

రుసీ

భయము లేదు.

అనార్కాళి

నా హృదయము కొట్టుకొనుచున్నది.

రసీ

భయము లేదు.

అనార్కాళి

నా కంఠము నణకి పోవునేమొ!

రసీ

మాటలాడకుండ మూర్ఛించుము. ఇంతలో కబురు వచ్చును.

ఉస్తాదు

జహాపనాహ్! క్షమించుము.

సలీము

చెలికాడా! ఫర్మానా చూపించుము.

(ఫర్మానాకళ్లకద్దుకుని) ఉస్తాదు

జహాపనాహ్! బిడ్డకు జ్వరముగా నున్నది. తమ యాజ్ఞాబలమే యామెను రక్షించినది. తప్పులు క్షమించవలయును.

మిత్రుడు

ఫరవాలేదు. కానిండు.

ఉస్తాదు

బిడ్డా, అనార్కాళీ!

అనర్కాళి

నీ పదమ్ముల యందు నిలచి యున్నది మనసు
ఆపదుద్ధారకా ఆనందమయ నాథ!
ఈ మహాఝురి యందు నీదు లాడగనైన
కాలు సేతులు రావు కరుణించవే నాథ!
హేనాథ! నీపాద మీా దాసి కన్నీట
కలుషితం బైనచో క్షమియింపవే నాథ!
ఈ తుమ్మి పువు కన్నె యెంత బేలయొ కాని
భృంగరాజును జూచి బెంగ కొన్నది చూడు.
హేనాథ! హేనాథ! హేదయావనరాశి
కలుషాత్మ యగు దీని గాల్చివేయుమునాథ!

(మూర్ఛ)

ఉస్తాదు

రసీ! రసీ!

మిత్రుడు

అయ్యో!

ఉస్తాదు

ప్రభువుగూడ మూర్ఛ పోవుచున్నాడు. దయా వనరాశి యీామహారాజు.

రంగము ౬

సలీము

నీ పదమ్ముల యంద నిలచియున్నది మనసు
ఆపదుద్ధారకా ఆనందమయ నాథ!

ప్రాణప్రియా! నాహృదయమును నీయందే నిలచియున్నది. మాతండ్రిచే కఠినముగా విధింపబడిన నాప్రవర్తనము నిన్ను నేనుదర్శించుటకుగూడ వీలులేకుండ జేయుచున్నది. అప్పటికిని నృత్యమును చూడవలెనను మిష చేత నిన్ను దర్శించుటకు వచ్చితిని. అపుడు నాదురదృష్టముచేత నీవు జ్వరార్తవైయుంటివి. అప్పటి నీజీర్ణశృంగారము నాకనుల కంట గట్టి నట్లున్నది. మనోహారిణీ!

దేవీ! ఇదిగో! ఈ ప్రకృతి వికసించినది. నీహృదయము నాయెడల వికసించ లేదేమి? నీవు నాయెడల నెట్టిభావములు గలదానవో తెలిసికొనకుండ నిన్ను దేవీయని సంబోధించుచుంటిని క్షమింపుము.





జేతవన స్తూపము - 1.







జేతవనస్తూపము. ౨.

నీకీ బానిసస్థితి లభింపజేసిన దైవ మెంత యనుల్లంఘనీయముగ నున్నది. నీవు బానిసవు గాకపోయినచో నీవిషయము నాతండ్రితో జెప్పి మనయిద్దరము నాయన యనుమతిమీదనే వివాహము చేసికొనెడివారము. ఇప్పుడు వారి యనుమతి లేదుగాన మన సమాగమము దూరమగుచున్నది.

నిన్ను చిన్నతనములో తెచ్చి బానిసగా నమ్మినవాడెవ్వడు? నీవే యింట నుద్భవించితివో తెలియదే! ఏ సత్కులమునందైన నే సంపన్నగృహమునందైన నీవు పుట్టినచో నా దౌర్భాగ్యము నీకింత మహాపకారము చేసినవాడనగుచున్నాను.

ఆహా! ఈ బానిసస్త్రీ యెంతచెడ్డది! చక్రవర్తులుగూడ భోగలాలసులై యిట్టి పనిచేయుట యెంత దేశారిష్టదాయకము! ఈవృత్తికి రాజులు సానుకూలపడుచున్నారు. చక్రవర్తులు ప్రోత్సహించుచున్నారు.

కానిమ్ము! బానిస మనుష్య కాకపోయినదా? భగవంతునియొక్క చిహ్నలాని మామెలో లేకపోయినదా? ప్రేమయను సమ్మతిపదార్థ మామెలో దొరకదా?

ప్రియా! నీకు దత్తమైన నాహృదయము మరల నేను లాగుకొనలేకున్నాను.

అనార్కలి బానిసకూతురు. నేను చక్రవర్తికుమారుడను. మాయిరువురి వివాహము రాష్ట్రమునకైగాని రాజునకుగాని యనుమతి యెట్లు? ఇట్టి సంబంధము గలిపించుకొని నా తండ్రికిని రాష్ట్రప్రజలకును నిష్టములేని పని యేల చేయవలయును? మానుకొందునా?

పుష్పకన్యకలు

ప్రాతర్వికసిత పంకజనిర్గత
బాధుర రమణీయామోదంబులు
నీలో దాగెనులే

వసంతుడు

ప్రాశాంచిత శాఖాబిందులు
మీలో దాగెనులే.

పుష్పకన్యకలు

బాలమ్మా నాలీలకలా-మ
... మనోహర నీలకచా-న
మ్మోదవసి పులకీకృతదేహ
(నృత్యము)

పుష్పకన్యకలు

కైసండిలుగొని కమలపరాగము
లాడట విసరెడు సరసులలో
పోదము మలయసమీరము సారము
పొల్చుకొన్న దారులలో.

వసంతుడు

సిగ్గేటికి వాసంతిక రావే
చేబూనవె నా ప్రాణసఖి
మ్రుగులు పెట్టితిపరాగ సంతతి
పూలువిరియు నీవనిలో.

అందరు

చిలుక వానలకు పరుపులు పెట్టిన
సెలల యిసుకపొరలో.
కలసిపోవుదము పాటలు పాడుచు
మలగిపోవుదము వీనిలో.

సలీము

ఆహా! ఏమా సౌందర్యము! తలంచు కొనిన కొలది నాయీ యూహాలువమ్మై పోవునట్లు

తెలిసినది. ఇరువురును బానిసలే. బానిస నని చక్రవర్తికి తెలియదు. బానిసనని బానిసకు తెలియును.

ఇంతగా సంస్కారము కల్గినను నా మనస్సున కింకను శంకారహితత్వము గలుగలేదు. ఉన్న యీ చక్రవర్తిత్వము తప్పుట యెట్లు? మనస్సు సమాధాన పఱచుకొన్న యీ సమానత్వ మాచరణకు దెచ్చుకొనుట యెట్లు?

కవి

భ్రూపుటంబుల దృష్టి నిల్పుకొని యోగి
ప్రకృతి బహిరంతరంబుల నిరీక్షవిల్లు
నాత్మ తత్త్వంబు చూచి మహాప్రపంచ
మందగా రాని యానంద మనుభవించె.

ప్రకృతి భేదమ్ము పేర్కొ బడిన నాస్తి
తాను మహావస్థగని తన్ను దాను చూచి
నవ్వుకొని మున్గిపోయె నానంద వార్ధి
సర్వవస్తు సమత్వంబు సంఘటిల్ల.

మధుర మధుమాస మరుదెంచి మధుకరీవి
లాసరాగంబు లాశావికాసమయ్యె
సృష్టియెచ్చట బులకింప నిండియునుచు
చెప్పగా రాని యానంద సిద్ధి కలిగె.

సలీము

మధుమాస వశమున బులకితమైన యీ ప్రపంచ మింత యానందదాయకముగా నుండి నాలో నున్న యీ శంకామాలిన్యమును తిరోహితము జేసినది. ఇంతవఱకు సందేహ వార్ధిలో నేనేల మహావాయుఘాత నౌక వలె నల్లలాడుచుంటిని? దేవి! అనార్కలీ! నీవే నా మనస్సున కధినేత్రివైతివి. భావిభారత చక్రవర్తిని నీవే. కాదా, నీకొఱకు నేను బానిస నయ్యెదను. నీవు లేని నాకీ రాజ్యమెందులకు? భోగము లెందులకు? దేవి! సర్వము సంకల్పించితిని. నాజన్మలో ప్రప్రథమమున నాదృష్టి నీమూలముచే తెరచినది. నీవు మహారాజపుత్రివి కానిమ్ము, బానిసవు కానిమ్ము! నాజీవితాంతమ్మును నీవే యధినాయకురాలవు. దేవీ! కటాక్షింపుము. ప్రసన్నా! అనుగ్రహింపుము!

# కోరిక

పెనుమర్తి వెంకటరత్నము గారు [యువకవిమండలి]

దేవుండు

ఏమి కావలె వరము కోరుము
నీ మహాతపములకు మెచ్చితి
భూమిలోపల నైంద్రలక్ష్మి
భోగమడిగెదవా?

భక్తుడు

విసిగిపోయితి నైహికంబుల
మునుగు వెట్టితి జ్ఞానదీపము
రక్తి లేదిక భోగములలో
ముక్తినిమ్ము గురూ!

యోగి

లోకమంతా మిథ్య కాదా!
శోకమొకటే ప్రాకిరాదా!
నాకొసంగుము సాయుజ్యపదవిని
నాయనుంగు తండ్రీ!

కవి

తనివి తీరదు! యెంత పాడిన
తనివి తీర దికెంత ఆడిన
ప్రకృతిలోపల నిన్ను చూస్తూ
పాడుకొందు గురూ!




శ్రీమతి రాజ్యలక్ష్మీదేవి

[హిందీభాషనుంచి అనువదించినది]

## ౧

సాయంకాలము వకీలు బజారునుంచి ఇంటికి రాగానే ఆయన భార్య మోహిని ఉత్కంఠతతో చూచి "ఈవాళకూడా మరిచిపోలేదుకదా?" అన్నది.

వకీలు మందహాసము చేసినాడు. మోహిని వికాసముతో ఆయనచేతిలోనుంచి "లెవెండరు" సీసా అందుకొన్నది.

సరిగా ఆవేళకే ఆయనపరిచారికకొడుకు కేశవుడు అక్కడికి పరుగెత్తుకు వచ్చాడు. సంతానము లేని ఆదంపతులహృదయాలు వాని ప్రేమతో నిండిఉన్నవి. కేశవుడు వారిప్రేమకు పాత్రుడు కావడానికి గుణముతో పని లేకపోయింది. బాలకులకు సహజమైన సారళ్యముతో కూడిన వానిచిరునవ్వు మోహిని చీరెకొంగునుంచి అనురాగమునూ ఆనందమునూ ఆకర్షించగలిగింది.

కేశవుడు వకీలు చెయ్యి పట్టుకొని "బాబుజీ, టోపీ తెచ్చారా?" అన్నాడు.

"తేలేదు కేశూ. ఈవేళకూడా మరిచిపోయాను" అన్నాడు వకీలు.

నిరాశవల్ల కేశవుని కళ్లనిండా నీళ్లు తిరిగినవి. మోహిని చూడలేకపోయింది. ఆమె కోపము తెచ్చుకొని "అయితే దీనికి శిక్ష ఏమిటి?" అన్నది.

"సర్కారువారి చిత్తం!" అన్నాడు భర్త.

భర్తకొత్తటోపీ—క్రొత్తకంపెనీవారు తయారు చేసింది—వంకెమీదనుంచి తీసి మోహిని కేశవునికి ఇస్తూ "తీసుకో కేశూ, ఇది తీసుకుపో" అన్నది.

కేశవుడు టోపీ తీసుకొని సంతోషముతో తల్లిదగ్గరకు పరుగెత్తుకొనిపోయినాడు. మోహిని చూస్తూ ఉన్నది. భార్యవిధించిన శిక్షను అపరాధి అయిన భర్త సిద్ధముగా స్వీకరించి నవ్వినాడు.

## ౨

"ఊఁ, నేను తప్పకుండా ఉత్సవానికి వెళ్లుతాను" అన్నాడు కేశవుడు.

"ఎవరన్నారు? అంతా వృథాది! ఏమీఉత్సవంలేదు కేశూ!" అన్నది తల్లి.

కేశవుడు తల్లి చెయ్యి పట్టుకొని వసారాలోకి తీసుకుపోయి "చూడు, ఎంతమంది గుంపుగా వెళ్లుతున్నారో! ఇంకా ఉత్సవం లేదంటున్నావు!" అన్నాడు.

"కాని నిన్ను వెళ్లనివ్వను" అని తల్లి బెదిరించింది.

కేశవుడు కళ్ళు నీళ్లుపెట్టుకుని "ఇవాళకు మాత్రం వెళ్ళనీ. ఇంక మళ్ళీ యెన్నటికీ వెళ్ళనమ్మా!" అన్నాడు.

తల్లి కేశవునితల నిమురుతూ "కేశవా, చిన్నవాడవు. ఒంటరిగా జనసంఘంలోకి ఎలా వెళతావు? బళ్ళకింద పడిపోతావేమో నాయనా!" అన్నది ప్రేమతో.

ఏమీ తోచక పిల్లవాడు గుంపుకేసి చూస్తూ "ఎంతెంతమంది చిన్నపిల్లవాళ్ళు వెళుతున్నారో. నే నొక్కణ్ణే చిన్నవాడినా? జాగ్రత్తగా వెళ్ళి వస్తాను. నిజంగా, అమ్మా!" అన్నాడు.

ఎన్నివిధాల చెప్పినా కేశవుడు వినకపోవడము చేత చివరకు తల్లి "సరే, వెళ్ళు. అయితే సూర్యాస్తమానం కాకముందే ఇంటికి రాకపోతే [illegible]!" అన్నది.

కోరిక నెరవేరినందువల్ల బాలుని ముఖము శోభాయమానమయింది. వాడు ఉత్సాహంగా "తప్పకుండా వస్తా అమ్మా" అని పరుగెత్తిపోయినాడు. తల్లి వానిచెయ్యిపట్టుకుని "ఈమురికిగుడ్డలతో వెళతావా? పద, మంచి చొక్కా తొడుక్కుందువుగాని" అన్నది.

కేశవుడు పెట్టెలోనుంచి కొత్తచొక్కా తీసుకుని తొడుక్కున్నాడు. "టోపీకూడా పెట్టుకో" అన్నది తల్లి.

కేశవుడు వెంటనే "అమ్మా! ఆరోజు బాబుగారిచ్చారే, ఆటోపా?" అన్నాడు. టోపీ శిరస్సుమీద ఉంచి "జాగ్రత్త, పారేసేవు!" అన్నది తల్లి.

క్రిస్టీటోపీ పెట్టుకుని కేశవుడు ఉత్సవము చూడడానికి బయలుదేరినాడు. సంతోషముతో తల్లి పిల్లవానికేసి చూచింది.

విదేశవస్త్రదహనం జరుగుతుందని కేశవుడికి త్రోవలో తెలిసింది. ఒకాయన విదేశవస్త్రాలు పోగు వేస్తున్నాడు. ఆయన కేశవునిదగ్గిరికి వచ్చి "తే, నీటోపీకూడా" అన్నాడు.

"ఎందుకూ?"

"కొంచెం సేపటిలో ఈవిదేశవస్త్రాలపోగు తగలబడిపోతుంది"

"అయితే, ఈటోపీకూడా తగలేస్తారా యేమిటి?"

"భారతవర్షపు ఉన్నతికోసం యజ్ఞం జరుగుతుంది. దాంట్లో విదేశీవ్యాపారం ఆహుతి అవుతుంది."

బాలుడేమీ గ్రహించలేక "ఊహూ..., నా టోపీ ఇవ్వను. టోపీ పోగొట్టుకోవద్దని మా అమ్మ చెప్పింది" అన్నాడు.

"చూడు. అందరూ తమబట్టలు ఇచ్చేశారు. నువ్వుకూడా తే" అని ఆయన బోధించాడు.

"నే నెలా ఇస్తాను? మాఅమ్మకు ఏం చెప్పను. అమ్మ నడిగివచ్చి యిస్తాను" అన్నాడు కేశవుడు.

ఆయన నవ్వి "సరే" అని వెళ్లిపోయినాడు.

తన ముద్దులటోపీని భద్రముగా చంకలో పెట్టుకొని కేశవుడు ఉత్సవము జరిగేచోటికి వెళ్లినాడు. అక్కడి విదేశవస్త్రాల రాశి ఆకాశము అంటుతున్నది. రకరకాల పట్టుబట్టలూ,

ఉన్నబట్టలు రంగులబట్టలూ, చాలాచాలా ఖరీదు కలవి పడవేసి వున్నవి. ఇంకా జనులు టోపీలూ, బట్టలూ పడవేస్తున్నారు. అంతి కంతకు గుట్ట పెద్ద దవుతున్నది. అదృశ్యము చూచి కేశవుడు దగ్గిరవున్న మనిషితో "ఈ బట్ట లెందుకు తగలేస్తున్నారు?" అని అడిగాడు.

"విదేశవ్యాపారం మన దేశాన్ని నాశంచేసింది. స్వదేశాభిమానం అవుతున్నది" అని చెప్పినాడు.

"నాటోపీకూడా విదేశంలో చేసిందేనా?"

"అవును"

"నేను దీన్ని తగలబెడితే ఏమైనా లాభ ముంటుందా?"

"తప్పకుండా"

బట్టలూ టోపీలు దగ్ధమూ వెలిసింది. మహాత్మాజీ వస్త్రాలకుప్పకు అగ్నిసంస్కారము చేయడానికి ముందరికి వచ్చారు. కేశవుడు వెనకనుంచి వచ్చిన ఆయన చెయ్యి పట్టుకుని ఆపినారు.

మహాత్మాజీ వెనకకు తిరిగిచూచాడు. చక్కని పిల్లవాడు చేతులో ఫెల్టుటోపీ పట్టుకుని "అప్పుడే కుప్పకు నిప్పంటించకండి. కాస్తసేపాగండి. నా బట్టలుకూడా పడేస్తాను" అన్నాడు.

అప్పుడు కేశవుడు ప్రపంచమే మరిచిపోయినాడు; తన కిష్టమైన టోపీ, తల్లిమాటలూ మరిచిపోయినాడు. తక్షణము తన ముద్దుల టోపీని కుప్పమీదకి విసరివేసినాడు. చొక్కా పడవేయడానికి విప్పుతున్నాడు.

మహాత్ముడు వాత్సల్యముతో కుర్రవాడిని గాఢము కౌగిలించుకుని "రా, నాయనా! నీ వస్త్రాలు లేకపోతే యజ్ఞము పూర్తికాలేదు. భారతపుత్రుడూ నిరసహాయుడూ అయిన చిన్న పిల్లవాని త్యాగము వల్లనే ఈనాటి సభ సఫల మవుతుంది" అని చెప్పినాడు.

కేశవుడు చొక్కా విప్పి విసరివేశాడు. మహాత్ముడు ఆనందముతో తన చల్లని చేతులు బాలుని శిరస్సున ఉంచారు.

బాలుడు పులకితుడై "మహాత్మాగాంధీకీ జై" అని కేకవేసినాడు. విదేశీవస్త్రపుగుట్ట విదేశ వ్యాపారాన్ని భస్మీభూతము చేసింది.

అగ్నిజ్వాలలు నలుదిక్కులా వ్యాపించి ఈ స్వాతంత్ర్యము ప్రకటించినవి. స్వర్గానికెక్కిన స్వదేశీ వ్యాపారము ఆకాశమునుండి పుష్పవర్షము కురిపించింది.

## 3

పొద్దు కూకింది. నిశాసుందరి ప్రకృతిమీద మొదటిఅడుగుపెట్టింది. కేశవుడు ఎంతసేపటికీ ఇంటికి రాకపోవడముచేత తల్లి వ్యాకులతతో వానిరాకకు ఎదురుచూస్తున్నది. కాస్త చప్పుడయితే కేశవుడు వస్తున్నాడనే భ్రమతో దారివైపు చూస్తూఉన్నది. నిరాశ కలిగినప్పుడల్లా కళ్ల నీళ్లుపెట్టుకొని తనకుమారుని భద్రముగా ఇల్లుచేర్చమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నది. పొద్దు పోయినప్పటికీ కేశవుడు ఇంటికి రాకపోవడముచేత తల్లి మోహిని దగ్గరకువెళ్లి

"మంచిపని జరిగింది కేశవా! దీనిగతి యింతే కావలె!"

"ఏమిటి! ఇదికూడా విదేశీదేనా!"

"అవును"

"అయితే సరిగ్గానే జరిగింది!"

తల్లి కేశవునిచెయ్యిపట్టుకుని "పద, నాయనా, అన్నం తిందువుగాని, ముఖమంతా వాచి పోయింది" అన్నది.

కేశవుడు చెయ్యి వదిలించుకొని "అమ్మా, ఉండు. ఈవిదేశీ సామానుపోయికూడా ఘోర తేయులమీద కసితీర్చుకోడానికి కాళ్ళల్లో గుచ్చుకుంటున్నది. పెంకుతేరి మహాసముద్రం లో విసిరిపారేస్తాను" అన్నాడు.

పగిలిపోయిన సీసాపెంకులు ఏరివేసి కేశవుడు తల్లివెంట వెళ్ళినాడు.

మోహిని ఇంట్లో మూలమూలలూ వెతికి విదేశీవస్తువులు పోగుచేస్తున్నది. వకీలు అక స్మాత్తుగా ఇంట్లోకి వచ్చినాడు! వచ్చి అదం తాచూచి ఉలిక్కిపడి "ఏమిటి చేస్తున్నావు" అని భార్య నడిగినాడు.

"ఏమిలేదు, విదేశీవస్తువు లన్నింటికీ స్వస్తి చెపుతున్నాను; ఇల్లువాడే టప్పటికి మనయిం ట్లో పరదేశపువస్తువు ఒక్కటీవుండకూడదు" అని భార్య చెప్పింది.

వకీలుతల గిర్రున తిరిగింది. నక్షత్రాలు ఒక్కొ క్కటే కళ్ళముందరిగా వెళ్ళిపో తున్నట్టు అయింది. ఆయన మోహినితో "సిగ్గు కాపా డుకోటానికైనా బట్టఉండనీ" అన్నాడు.

"ఇప్పుడు మన దేశంలో సిగ్గుకూడానా? విదేశీ వస్త్రాలుకొని సిగ్గువదిలే కానక ఇంకా రక్షణ మెందుకు? సీతాసావిత్రులమానము కాపా డిన దేశీయువల్కలాలను దయాస్వరూపిణి అయిన ప్రకృతి మన కివ్వదా? బట్టలుకోసం భారతఖండం చింతిస్తుందా? ద్రౌపదికి అనంత వస్త్రాలిచ్చిన భగవంతుడు మనకు వస్త్రాలు లేకుండా చేస్తాడా?"

ఈమాటలంటూ ఆవిడ వంకెమీదవున్న చీరె తీసి కిందపెట్టి మధ్యలో పడవెయ్యబోతూ ఉంటే భర్త అడ్డమునిచ్చి "అమ్మా, అది విదేశీది కాదు, స్వదేశీ బనారసు చీరె" అన్నాడు.

"కాని విదేశీదుర్గంధం వస్తున్నది దాంట్లో నుంచి"

"ఏం దుర్గంధం?"

"వాసన చూడండి"

ఆయన చీరె వాసనచూచినాడు. లెవెండరు పరిమళము ఘుమఘుమలాడింది. ఆయనఏమీ మాట్లాడలేదు.

విదేశీబట్టలన్నీ అంగణములో పోగుచేసి మో హిని కొరివి అంటించబోతున్నది. బయటి నుంచి బిచ్చగత్తె యిలా ప్రార్థించింది. "అమ్మా! రెండుమూడుబట్టలు ఇందులోనుంచి నాకు దయచెయ్యండి, తగలబెట్టకండి. మీ పేరు చెప్పుకుంటూ శీతాకాలంలో నేను, నాపిల్లలూ వెచ్చగా కప్పుకుంటాం అమ్మా!" దాని మాటలు లెక్కచెయ్యక మోహిని "ఈవిదేశీవస్త్రాలలో ఒక్కొక్కపోగు వేల

కొద్దీ సూదులై నీశరీరాన్ని గుచ్చుకుంటవి" అని చెప్పింది.

భిక్షుకురాలు అంతటితో ఊరుకోక మళ్లీ "దీనురాలను, బికారిని! అమ్మా, కట్టుకోటానికి ఒక్కబట్టయినా లేదు. ఒక్కటైనా ఇవ్వావమ్మా!" అని వేడుకున్నది.

"మన దేశంలో జనమంతా వస్త్రవిహీనంగానే ఉంది. అంతా దరిద్రులే సుఖంగా వున్న దెవరు? పో, వెళ్లిపో, మన దేశానికి స్వరాజ్యం వచ్చేవరకూ శీతకాలం ఏలాగో గడుపు. పో" అని మోహిని చెప్పింది.

అగ్గి తగలగానే విదేశీవస్త్రాల పోగు భస్మమవుతున్నది. ఆనందముతో చేతులు తట్టుతూ గంతులు వేస్తున్న చిన్న వేళవులు అగ్నికాంతిలో మోహినికి కనుపించినాడు.



# డాఁగురుమూఁతలు

సాహిత్యసరస్వతి సీరిపి ఆంజనేయులు గారు

గమనవేగభరమ్మునఁ గ్రాఁగి, మిత్ర!
బహుళదుర్గమాధ్వాన సంభ్రమసమ
తాంతరంగుఁడ వగుచు, దినాంతసమయ [స్వ
మున నరుణకాంతు లాననమునఁ జెంగ
సరిపుఁ బసిఁడిపసుపులు చాఁపినట్లు
కదిసి తరగల మిసుఁగుఱుల్ చెదరినట్లు
వలితెరల జాళువానన్నె యలఁదినట్లు
ముదిరమోమునఁ గెంపులు వొదిగినట్లు
తోఁచి తోఁచనిజాడలఁ దోఁచుచుండి
సౌమ్యసంసక్తమైన కెంజాయ దనరు
పశ్చిమాశాంతరాంబరపటలిఁ జొచ్చి,
సవ్యతేజంబు నందు లీనంబు నరచి,
కడఁగి వెన్నాడు చెలికిఁ గన్పడని మాడ్కి
నాఁగి, మబ్బుల నడుమఁ దాఁగి దాఁగి,
యెడనెడను నీవు పొడమి పర్వెడుచు నుండఁ
గాంచి, పూర్వాద్రి ధవళమేఘముల నడుమఁ
జనుచు, నల్లన నెందొ డాఁకొనుచు, వగలఁ
గనుచుఁ, జలివెలుంగుల నెల్లకడలఁ జిందఁ
గోరి, పదునాఱుకళలు నిండారఁ బొలిచి,
సుప్రసన్నముఖుండవయి సుస్వభావ
గరిమ విలసిల్లి, నెంతయు మురువు హెచ్చఁ,
బసవెసంగఁ, దీప్రోత్సాహపటిమ వెలయఁ,
బ్రీతి నిన్ను వెన్నంటుజాబిల్లి నెఱిఁగి—
మీరు డాఁగురుమూఁతల మెలఁగ నిట్లు
నవ్వనవ్వుల నుండి మీచెంతు వెలిసి
పలువెలుంగుల మురియు రిక్కలఁ దలంచి—
ఈవినోదంపుఁ గలిమి హెచ్చించు వేడ్కఁ
దలఁచు మీకడ్డవడు జలదమునుఁ జూచి—
పెరిమఁ గనుమూసి గంతలు వెట్టి సమత
నెల్ల జగముల—'మిమ్ము'— క్రీడింపఁజేసి
యుల్లమున సంతసిల్లెడు తల్లి నెంచి—
చిన్ని బుడుతలు— కవులు హర్షింత్రుగాదె?

గంతులు వేయుచు నెట్లు మసలఁగలిగినావో అగమాత్రము చెప్పవలసియున్నది.

ఏలాపాఘుఁడు.—అన్నా! దీనికిని సమాధానము కావలసియున్నదా! అట లేని చిత్తగింపుఁడు. ఏప్రకారముగా భూమిమీఁదను ఋషులు మొదలగువారి వేదాధ్యయనాదులును, వీరపురుషులయుద్ధక్రియలును గృహస్థులయిండ్లలో వివాహోద్యుత్సవాదులును జరుగుచుండెడివో, మఱి, దానిపయిని యుండెడివారు బ్రదికియుండిరో, ఆభూమి శ్రీకృష్ణుని ఉదరములో ఉండఁగలిగినదో అదేప్రకారముగా కరుబూజాకాయలోపల విహరించుటను తనకు, గంతులువేయుచు జీవించి యుండవచ్చును. ఇందులో అసంభవమేమున్నది?

కంఠీరవుఁడు.—అన్నా! మీ రిప్పుడు సెలవిచ్చినదానిలో నా కొంతవఱకు సంశయ మేర్పడినది. శ్రీకృష్ణుఁడు తనకడుపులో జగమంతయు నెట్లుంచుకొనఁగలిగినాఁడో, అతనికడుపులో అది యెట్లిమడఁగలిగినదో నాకు బోధపఱుప వేఁడెదను.

ఏలాపాఘుఁడు.—వినుము తమ్ముఁడా! వినుఁడు. నేనొకప్పుడు బ్రహ్మకును, విష్ణువునకును వివాదము తటస్థించినది. "నాముఖమునుండి బ్రాహ్మణులు, బాహువులనుండి క్షత్త్రియులు, ఊరువులనుండి వైశ్యులు, పాదములనుండి శూద్రులు, ఈప్రకారముగా నాలుగువర్ణములవారును పుట్టియున్నారు. కాఁబట్టి, నేనే జగత్తులకు కర్తను" అని బ్రహ్మదేవుఁ డన్నాఁడు. అతఁ డన్నమాటలు వినఁగానే కోపించి శ్రీవిష్ణుఁడు "ఓరీ మూర్ఖుఁడా! నీ వనఁగా నేపాటివాఁడవురా! నీవు నా నేవకుఁడవు కావా? నీ కిట్లహంకరించి మాటలాడుటకు సిగ్గయినను లేకపోయినదేమిరా? భూమ్యాకాశములు పెదవులు, పర్వతములు గడ్డము, సముద్రములు జిహ్వయును గాఁగల నాముఖమునం దొకసారి తొంగిచూచినపక్షమున నీ కీజగత్తంతయు కనుపడునే! నీపుట్టుపూర్వోత్తరములే నీకు తెలియనియట్టు లున్నవి. నీవు నానాభికమలమునుండి పుట్టినవాఁడవే కావఁటరా? అట్టులుండినప్పటికిని నిన్ను నీ వెఱుఁగఁజాలక నాయెదుటనే యెంతో గొప్పవాఁడ వయినట్టుగా నోటికి వచ్చినట్లెల్ల మాటలాడుచున్నావుగా! చంద్రునిప్రభావానుగ్రహములవలన వికసించిన కలువపువ్వు చంద్రునే వెక్కిరించుటయా? వారె వాహ్వా! ఏమి నీయనాత్మజ్ఞత? చాలు, నీపాటికి నోరు మూయుము" అన్నాఁడు.

కంఠీ—పోనిండు కాని, అన్నా! అంతటి పెద్దపక్షి—అనఁగా, తనకడుపులో అజగరాదులను ఇముడ్చుకోఁదగినంతటిపక్షి యొక్కఁడనయినను ఉండఁజాలునా? అది యెట్లు సిద్ధమగునో సరిగా సమాధానము చెప్పవలయుఁగాక!

ఏలాపాఘుఁడు.—అన్నా! మీరు ద్రౌపదీదేవి స్వయంవరమునాఁటి ధనుస్సంగతి యెఱుఁగనియట్లు లే మాటలాడుచున్నారే! దానిమీఁదను పర్వతములు మొదలగునవి స్థాపింపఁబడినవి గావా! ఒకవేళ, మీ రాకథ వినియుండని పక్షమున నే నిప్పుడు చెప్పెదను. చిత్తగింపుఁడు. ద్రుపదమహారాజు తనకుమారియగు ద్రౌపది వివాహమువిషయమున "ఏపురుషుఁడు దేవతాధిష్ఠితమయిన మాయాధనుస్సు నెక్కువెట్టి లక్ష్యమును చిప్పకొట్టఁగలుగునో, అతనికి నాకూఁతు నిచ్చి పెండ్లి చేయుదును" అని చాటింపించినాఁడు. ఆ చాటింపు విని ధనుర్ధరులగు రాజు లెందఱో వచ్చినారు. గొప్పగొప్పబలవంతులని పేరుపడిన వీరులు సైతము ధను వెక్కు పెట్టఁజాలకపోయినారు. తుదకు శిశుపాలుఁ డెక్కువెట్టుటకు బయలుదేఱినాఁడు. అప్పుడు శ్రీకృష్ణుఁడు వెంటనే ఆధనుస్సుపయిని మేరుపర్వతము, గరుత్మంతుఁడు, హాలముసలములు, సర్పము, శంఖము, చక్రము, గద మొదలగు నిన్నివస్తువులు భార మెక్కువయగునట్లు ఉంచినాఁడు. కాని, అంతమాత్రమున శిశుపాలుఁడు చలింపనే లేదు. అతఁడు సులభముగానే ఆధనుస్సు నెత్తి నారి బిగించుటకు ప్రారంభించినాఁడు. అది చూచి కృష్ణుఁడు, చంద్రుని, సూర్యుని, అగ్నిని, సముద్రములను, పర్వతములను, భూమిని మఱింత బరువుకోసము దానిపై నుంచినాఁడు. ఎన్నివస్తువులు జోడించినప్పటికిని శిశుపాలుఁ డెక్కువెట్టఁ గలిగినాఁడు. ఒక్క అర్ధాంగుళముమాత్రమే అంతర మున్నది. ఆసమయమున కృష్ణుఁడు ధనుస్సును తనకాలితో తన్నినాఁడు. అందువలన ధనుస్సు వేగముగా శిశుపాలుఁడు క్రిందను పడిపోయినాఁడు. అటు




నాళము కృష్ణారావు గారు

## కాలయాపనము

పాపపుష్పంగ నొకసారి పూలతోట
కేఁగియుంటిని—అక్కటా! ఏమి చెప్పుదు!
బూచులో యనఁ గనుపట్టె పూలచెట్లు,
గాలి సోఁకినగతి చల్లగాలి సోఁకె.

ఉబుసుపోకకు వెడలితి నొక్కనాఁడు
నాదు మిత్రులతోఁ గూడి నావపైని,
పయిరగాలికి నల్లాడు పడవలోని
ఉల్ల మొంతయుఁ గలతచే నూఁగులాడె.

ఎట్టులెట్టులో కాలంబు నెట్టిపుచ్చ
ననుఁగుమిత్రునిఁ గూడి వయ్యాళి నెపుల,
అనునయంబుగ నతఁడు మాటాడినట్టి
పలుకు లన్నియు నక్కటా! ములుకు లయ్యె.

నాటకముఁ జూడ నే నొక్కనాఁటిరాత్రి
అనుఁగు నెచ్చెలికానితో నరిగియుంటి,
ఏమి చెప్పుదు— నాతోడ నీవు లేమి
నాటకం బెల్లఁ గనుపట్టె బూటకముగ.

అక్కటా! ఏమి చెప్పుదు — నొక్కరేయి
నీవు తలఁపునఁ బొరలంగ నిదుర రాక
దిగ్గురని పాన్పుపైనుండి డిగ్గనుఱికి
క్రుమ్మరిల్లితి కొఱవిదయ్యమ్మురీతి.

నిన్నుఁ గన్నట్లు ముద్దిడుకొన్నయట్లు,
కౌఁగిలించినయట్టులు కలలు గాంచి
ఉలికిపాటున లేచి నే నొక్కరేయి
పడినదురవస్థ యెల్ల దైవంబె యెఱుఁగు.

ఏను పురవీథిఁ జనుచుండ, హితుఁ డొకండు
'కొడుకు లెందఱు నీ' కని యడిగె నన్ను;
పిడుగుఁ బోలినయామాట వినినయంత
చిత్తరువురీతి నిలిచితి చేష్ట లుడిగి.

నేఁడు నడువీథిఁ జనుచుండ నిన్నుఁ బోలు
బూరిబుగ్గలబుడుతఁడు తారసిల్ల,
కాంక్ష దీఱ నెగాదిగఁ గాంచుచుంటి
వ్రీడచే నాఁడు నెమ్మోముఁ ద్రిప్పుకొనియె.

బుడుతఁ డెవ్వఁడో చాన, నాపొంతఁ జనుచు
కంటఁ దడిపెట్టితిని నీవు జ్ఞప్తి రాఁగ,
చుట్ట మని యెంచి వాఁడు నాచుట్టుఁ జేరి
గొల్లు మని యేడ్వ, సురిగితిఁ దెల్లవోయి.

చుట్టములు నన్నుఁ బిలువంగఁ జూడ నేగి
నేఁడు చూచితి నీయీడుజోడువాని
పాప నొక్కని— ఏమిపాపంబొ కాని—
గుండె జల్లన నేలపైఁ గూలినాఁడ.

అకట! నీతోనె నాయాస లంతరించె,
వాంఛ లడుగంటె, తలఁపులు వ్యర్థ మయ్యె,
చిత్త ముడిపోయె, ప్రొల్లయ్యె జీవితంబు;
ఎట్లు గడపుదు కాలంబు నింకమీఁద?

కేలఁ జిక్కినరత్నంబు గోలుపోయి
గాజుపూసను గని తృప్తిగాంచినట్లు,
విమలగుణనిధివగు నిన్ను వీడనాడి
గడపుచుంటిని రిత్తసౌఖ్యములఁ దవిలి.

## శత్రువులు

కొడుకు చావంగ నే మూలఁ గూలియుండ,
ఇదియె యదనని నాశత్రు లదయు లగుచు
నొక్కపెట్టున జెలరేఁగుచున్నవారు;
తాళ నేర్తునె వారియౌద్ధత్యమునకు?

పిడుగు మొత్తఁగఁ గూలినబడుగువాని
కొఱవిచేఁ బట్టి కాల్చినకరణి నకట!
కొడుకుచావునకై నాదికుందుచున్న
నన్ను శత్రులు వెతబెట్టుచున్నవారు.

ఒక్కయెడ నాత్మజవియోగ, మొక్కచోట
భీషణం బగు శాత్రవదూషణంబు
తట్టుముట్టాడ, రెంటిమధ్యమునఁ జిక్కి,
యుంటి నడకొత్తులో వక్కగొంటు రీతి.

ఇంతకాలమునుండి న న్నెంతొ ప్రీతిఁ
నాదరించుచునున్నటి యనుఁగుసఖులె
శత్రులుగ మాఱి రిపు డేమి చిత్ర మొక్కొ?
కటకటా! ఏమి సేయుదుఁ గాలమహిమ!

నాదుపుత్త్రుఁడె శత్త్రుఁడై నన్ను పీడ,
అనుఁగుమిత్రులు శత్రువు లగుట యరుదె?
అకట! దైవోపహతుఁ డైనయట్టివాని
కఖిలజగమును బ్రతికూల మగును గాదె?

పుత్త్రుఁ డైనను గానలె, మిత్రుఁ డైనఁ
గావలయు సంత్ర మనజుని గాసివెట్ట;
అకట! పుత్త్రుఁడు మిత్రులు నొకట నన్ను
వెతలుబెట్టఁగ నేరీతి వేగువాఁడ?

శత్రువులు నన్నుఁ దిట్టిన నాత్రపడక
మంచిమాటలచే బతిమాలియుంటి,
ఎంత వేఁడిన నించుక శాంతి గొనక
దాడివెడలుచు నున్నారు వాఁడి సూపి.

అనునయోక్తులఁ బ్రతిపక్షజనుల వేఁడి
కొనుటయెల్లను బేరి జోకొట్టు టయ్యె;
వారి శాంతింపఁ జేయ నావశము గాదు,
సుప్రసన్నులఁ జేయవే! అప్రమేయ!

తన్ను పగతుఁ నొంచిరి, తాను పగఱ
నొంచితి నటంచు కించిజ్జ్ఞుఁ డెంచుచుండు;
అరయ దేహంబునకె కాని యాత్మ కెందు
చెలిమికారంబు వైరంబు కలుగఁ బోవు.

చెవికి నింపగుపలుకులచే హితుండు
పరుషనిష్ఠురవాక్కలాపముల వైరి
తనదుచేతల నారసి తప్పు దిద్దు;
శత్రుమిత్రవిభేదంబు ధాత్రిఁ గలదె?

ఎక్కసక్కెపుమాటల నెత్తిపొడిచి
తాను చేసినదుష్కృత్యములఁ దెలుపు;
శత్రుఁ డెన్నంగ శత్రువేషమున నున్న
మిత్రుఁడే కాని కేవలశత్రు వగునె?

తనదుదోసంబు లారయు, తప్పులెన్ను,
దుర్గుణము జాటు, పాపంబు లుగ్గడించు,
దుర్నయంబులు వెలివుచ్చు, దోసఁగు లెంచు;
శాత్రవునికంటె నాప్తుఁడు జగతిఁ గలఁడె?

చండకరుఁ డయి తమ మెల్లఁ జెండు నొకఁడు
శీతకరుఁ డయి మనసు రంజించు నొకఁడు
శత్రుమిత్రులు భాస్కరచంద్రులట్లు
వారు పరమోపకారులు కారె జగతి?

మువ్వురే నాకు శత్రులు పుడమియందు
'కొడుకు లెందఱు నీ' కని యడుగువాఁడు,
'పాప' యను పేరు నే వినఁ బలుకువాఁడు,
చిన్నిపాయంపుమురిపంపుపిన్నవాఁడు.




సుదత్త స్తూపము. (కచ్చిరూటి)
శ్రావస్తి



# విమానం యెక్కబోతూనా

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

" వెంకయ్యా!"

" ఏమి తల్లీ?"

" ఏమని సెలవు?"

" ఇదిగో కైజారు"



"ఇదుగో కైజారు"

" రాజుగుండెలు తీయడానికేనా?"

" అదెలాగ మాతల్లీ."

"ఏమీ? వెలమబిడ్డను గాదుటోయీ?"

" అది పురుషుల పని తల్లీ!"

" వెలమల ఆడవాళ్లు చేతగానివాళ్లా?"

" స్త్రీలు అసూర్యంపశ్యలు కాదుటమ్మా?

" అంటే?"

" మీరు బైటికి రాగూడదు."

" వస్తే?"

"వెలమస్త్రీ పురుషుని కంట పడ్డాక ఇక మాకు మర్యాదయెక్కడిదమ్మా?"

"ఎంత పాపిష్ఠి బ్రతుకోయీ మాదీ? మాలమాదిగల దగ్గరనుంచి బ్రాహ్మలదాకా అన్ని జాతుల స్త్రీలూ అవసరమైనప్పుడు వీథిలోకివస్తూన్నంటే వారికి లేని మానభంగం మాకెలా వస్తుందోయీ?"

" మొదటినుంచీ అది మనఆచారం కాదా అమ్మా!"

" స్థితి విషమించినప్పుడు కూడా అంతేనా?"

" తెగించినవాళ్లకి విషమించడం నేమిటి తల్లీ?"

" అదీ మాట, మరి మేము తెగించ కూడదూ?"

" అవశ్యమూనూ."

" ఎందుకూ?"

" ప్రభువు ఆజ్ఞ నెరవేర్చడానికి"

"గొంతుకు పిసుక్కోడానిగ్గాదూ?"

"... ... ... ..."

"మాట్లాడ వేమోయీ?"

"ఏమి చెప్పను తల్లీ?"

"ఏమి చెబుతావో? ఏతికర్మమోయీ మాకూ? శత్రువు వచ్చి గొంతుకుమీద కూచున్నప్పుడేనా—మగవాళ్ళకి తలదాటి వచ్చినప్పుడేనా—"

"వెలమబిడ్డలికి తలదాటిరావడం యేమిటి తల్లీ?

"అయితే యిప్పుడు నిరాకరణకర్థం యేమిటి?

"ఆ ప్రభువు ఆజ్ఞ."

"అదే నోయీ! ప్రభువు యెందు కిలా ఆజ్ఞాపించవలసివచ్చిందీ?"

"మానభంగం కాకుండా వుంచడానికి"

"మానభంగమా? ఎవరికీ? వెలమస్త్రీలకే? ఎంత మాటా? బొబ్బిలి వెలమస్త్రీలకే! మేము యుద్ధంలోకి వెడితే పగవాడు యింతకంటే కఠినంగా మాట్లాడతాడా?"

"తర్కానికిదా సమయం తల్లీ?"

"అది నేనడుగుతూవున్న మాట. వెలమ స్త్రీలు బైటికి రాకూడ దన్నది సామాన్య ధర్మం. స్థితి విషమించినప్పుడు యెందుకు రాకూడదూ?"

"వెలమలు ఇదివరకు చేసిన యుద్ధాల్లో ఎప్పుడేనా స్త్రీలు కత్తిపట్టడం—"

"శత్రువుమాట విని పైవారు కోట విడిచి పొమ్మనడమూ- శత్రువు దుష్ప్రయత్నాలు ఫలించడానికి సిద్ధంగా వుండడమూ—"

"ఒకదాని కొకటి యెప్పుడేనా పోలిక వుంటుందిటమ్మా?"

"మరి ఆమాట యెందుకూ యింకా? అప్పటప్పటి వెలమస్త్రీలు యుద్ధాల్లోకి యెందుకు వెళ్ళేదికాదో మన కేమి తెలుసునూ? కాకపోయినా యిప్పుడు మనకి వచ్చిన అవస్థ వంటి అవస్థలు వారికి వచ్చాయనీ, అయినా అప్పటి వెలమస్త్రీలు యుద్ధంలోకి వెళ్ళక అంతఃపురాల్లో పొడుచుకు చచ్చిపోయారనీ నిదర్శనా లేవీ? అవీగాక వారు వీరమాత లైనా వీరాంగన లనిపించుకోవా లని ముచ్చట పడక పోవచ్చు. ఇప్పుడు మేము—నేనలా కాదు. నా శౌర్య మంతా యేమి కానూ? కత్తిపట్టా లని నాకు సరదా పుట్టింది. నేను వీరమాత నగుదునో కానో తెలవడానికి నా కొడుకు పాలబుగ్గలవా డాయె. నేనువీరవనిత ననిపించుకోవాలి. చిన్నతనములో నే "మల్లమ్మ విచక్షణాశక్తి కల స్త్రీ" అని పేరు తెచ్చుకున్నాను. నీ ప్రభువికి తగిన స్త్రీ ననిపించుకున్నాను. మరి యింక ప్రాసపాటి విజయరామ రాజుకి కాళికాశక్తి ననిపించుకోవద్దుటోయీ?

"........"

"ఏమంటావు వెంకయ్యా? వెలమల ప్రయత్నాలు—అంటే పురుషుల శౌర్యం నిస్తేజం—"

"ఏమన్నావు తల్లీ?"

"ఉలికిపడకు. నువ్విప్పు డేమి చెయ్యడానికి వచ్చావో తెలుసుకుని మాట్లాడు. చూడూ. బొబ్బిలివెలమవీరుల శౌర్యం నిస్తేజం అయినప్పుడు—"

"విసపేను. అమ్మా! నారక్తాన్ని వేడెక్కనివ్వవద్దు."

వేడెక్కితే విక్రమిస్తావు. స్త్రీలమీద. కదూ వెంకయ్యా? నిజంగా నేను వెలమ వీరుల రక్తంలో ఉష్ణగుణమే వుంటే యింకా శత్రు వలా కులుకుతూ వుంటాడా? ఏమి దుష్కాలం?

"కాలం దుష్టమైపోయింది కనకనే ప్రభువు ఆజ్ఞ యిలా వుంది."

"అలా కాదు. కాలం దుష్టమైపోయింది కనకనే స్త్రీలుకూడా కత్తిపట్టాలి. తెలిసిందా? శ్రీ రాజా రావు రంగారావు దొరవారికి నేను ధర్మపత్నినే. నేను వారికి సహధర్మచారిణ్ణనిపించుకోవద్దటోయీ?"

"కాక యిప్పుడేం లోటువచ్చింది తల్లీ?"

మళ్లీ మొదలూ. ఏమి మిగిలింది నాయనా, బొబ్బిలిరాణికి మూడుపిగాళ్లు ముండభరణం యిస్తానన్న రాజు బ్రతికి వుండగా? బొబ్బిలిరాణి—నాకింతకంటె మాన భంగం ఏమిటోయీ?"

"..........."

మీ ప్రభు వెక్కడ?"

హజారంలో—వెలమవీరుల మధ్య—సర్వ సన్నద్ధుడై—అంటే అటోయిటో తేల్చి వెయ్యడానికి సిద్ధంగా—"

"పోయి యీసంగతి చెప్పిరా."

"ఆజ్ఞ లేదు తల్లీ!"

"పోనీ నేనే వెడతాను. నా కడ్డేమిటి?"

"నీకడ్డేమిటి తల్లీ? అయితే ముందు—ఈకైజారు పుచ్చుకుని—యిక్కడ పొడిచి—"

"అది మల్లమ్మ చేసే పని గాదు. నేను కైజారు దూయడమే వస్తే అది రాజు పేగులు బైటికి తియ్యాలి. స్వజనంమీదటోయీ నా ప్రతాపమూ? వెంకయ్యా! నాకింక నా దేవుని దర్శనం లేదూ!"

"ఈ క్షుద్రమానవకళేబరం విడిచిపోయిన తరవాత. అది శాశ్వతమే కాదుటమ్మా?"

"ఈకళేబరం వున్నంతసేపే యీపగా, యీకసీసి"

"వాగ్వాదం చాలించవు తల్లీ?"

"బొబ్బిల్లోని శౌరిస్త్రీలు పగవాళ్లని తూనికరాళ్లతో చీకాకుపరిచారుట. వెలమస్త్రీలు ఆమాత్రమేనా కారుటోయీ?"

"..........."

"ఏమంటావు?"

"ప్రభువు వార్తకోసం కనిపెట్టుకొని వుంటాను"

"చెలికాని వెంకయ్య జనానాని సరికేశాడన్న వార్త వినడానిక్కాదూ? ఏమి కర్మం వచ్చిందోయీ మాకూ? సత్యభామ కాసె బిగించి విల్లు వంచి నరకాసురుణ్ణి గజగజలాడించింది. రాజపుతానాలో క్షత్రియస్త్రీలు ఒక్కొక్కప్పుడు కత్తిదుయ్యగా తురకసేనలు బేజారై పోయీవి. ఓరుగంటిలో రుద్రమా, పల్నాటిసీమలో నాయకురాలూ కత్తిపట్టగా పరసేనలు చెల్లాచెదరై పోయాయి. మరి బొబ్బిల్లో మల్లమ్మ కైజారుదూస్తే రాజేమయిపోతాడో లోకానికి తెలవనివ్వవుటోయీ?"

"సాహాలమ్మ నేమి చంపగా తల్లీ?"

"ఏమిటీ? సాహాలం? అది వెలమల— అంటే వెలమస్త్రీల శక్తి తెలిసినమాటే?"

"…………"

"అయ్యో! ఈ సమయంలో మీ అన్నయ్య లేకపోయాడుగదా? తాండ్ర పాపారాయడే వుంటే కొయ్యా యిలా మించి చిచ్చునా?"

"పాపయ్య కీవార్త తెలిసిందో లేదో!"

"అవును. పాపయ్య కీవార్త తెలిసిందో లేదో? పాపయ్య లేడు. త్వరలోనే వస్తాడు? కోటాలు పలికిన వెంగళరాయనేడీ? చెలి కాడి వెంకయ్య సంగతి తెలుస్తూనే వుంది. లావు చిన్నయ్య, దామెరదమ్మన్న, సంతెన బుచ్చన్న, ఇసగంటి నరసన్న, కాకర్లపూడి వేంకటరామరాజు ఏరోయీ వీరంతాను? ఏంచేస్తున్నారోయి? రాజు దుర్మరణంవార్తవినా చెవిని వెయ్యగల మగవాడు బొబ్బిలికోటలో లేడుటోయీ?"

"…………"

"మూర్ఛపోకు, కాకపోయినా యేమని మూర్ఛపోతావు? క్షత్రియరాసి జనానామీదకి వచ్చావు. మంచిపని పెట్టేడు ప్రభువు నీకు. నాయనా! వెలమస్త్రీలకు పగవాళ్లని పొడవడానికి వీల్లేకపోయినా శాంతంగా పొడుచుకోడానికేనా అవకాశం వుండనియ్యి. నూరు కుటుంబాల వెలమస్త్రీలు! మంచి సమయంలో మొత్తశక్తి వ్యర్థం అయిపోతూవున్నదే! ఇష్టం లేకపోతే జయించినా మేం బతకం. చచ్చిపోడానికేనా యుద్ధంలోకి వెళ్లనివ్వ మనవోయీ మీ ప్రభువుతోటీ."

"ప్రత్యుత్తరం యేమిటు తల్లీ నీకూ? అక్కడ రంగారావు మాట యెంతో యిక్కడ మల్లమ్మమాట అంతే మాకు."

"అయితే యుద్ధంలోకి వెళతాం పద."

"అది రాజాజ్ఞకి వ్యతిరేకం తల్లీ!"

"సరే. ఇంకెందుకూ మరి పొగడ్డమూ?"

"నేను రావువారి సేవకుణ్ణి కానుటయ్యా? దొరవారి ఆజ్ఞ అలా వుంది."

"దొరగారి ఆజ్ఞ నేమిటి? ఇది దొరసానిగారి ఆజ్ఞ. వెళ్లి మీదొరని తీసుకురా యిలాగ."

"వచ్చిన పని కాకుండా కల్పించడానికి ఆజ్ఞ లేదుతల్లీ!"

"అంతే? ఎంత చెప్పినా నీమీా ప్రయోజనం లేదూ? మరి పోయినా లోకం వుంటుంది. తెలుసునా? బొబ్బిలి వెలమలు అమానుషచర్య నడిపిన విజయరాముణ్ణి పొడిచెయ్యలేకపోయా రనీ, అసని చెయ్యడానికి స్త్రీలు సిద్ధపడంగా అడ్డువచ్చా రనీ— తెలుస్తోందా?"

"…………"

"వెంకయ్యా!"

"ఏమి తల్లీ?"

"ఏమంటావు?"

"ఆలస్యం అవుతోంది."

"అలా అన్నావా? అనవూ మరీ? దొరకి తగిన జెట్టివోయి నువ్వూ. ఆలస్యం

అయిందికదూ? ఏమంటే నేం చెబుతాను వారికి? పగవాణ్ణి పొడిచెయ్యవలసిన కైజారుని పెళ్లాంమీదకి తిప్పించావా అని అడిగిందని చెప్పేం. పట్టుమంటే గుప్పెడుండదు ప్రాణం. దానికోసం కాదుసుమా యీరాజ్యాంగ సిద్ధాంతాలూ. పగవాడు కాని మాటలనడమూ మగవాడు కానిచేత చెయ్యడమూనూ. తల్లీ మంచిపోయింది నోయీ! చిత్రసేన మేలుచుమీ యింతకంటే! బ్రహ్మహత్య మహాపాతకం అన్నారు పెద్దలు. బొబ్బిలిరాణీ కదే సంభవించింది. పొడిచి పొడిచేసుకుంటే యీదుఃఖమూ, యీతహతహా లేకపోవును. తప్పదే మనుకుంటే యేమౌనుంది! రంగారాయనంతటి వీరుడి పెళ్ళానికి యిలాంటిగతి తప్పదింక యేమౌతుంది? బొబ్బిలికోట మీద యిక విజయనగరం జెండా యెగురుతుందా! బతికున్నంటే బొబ్బిలి దానికి భరణమే యిస్తాడు రాజు—"

"అమ్మా!

"ఏమి నాయనా? ఆలస్యం అయిందా? వెలమలకి శత్రుసంహారానికి మల్లమ్మ ఆజ్ఞ వచ్చిందికదూ? ఏదీ కైజారింతే. పదునుగావుందా? మీ ప్రతాపం లంగ మొక్కపోయిందా?"

వెంకయ్యా! ఇంత సేపున్నుంచీ వాగేను. ఏంవచ్చిందీ? అయితేలే. పగతీరకుండా చచ్చిపోయామటప్పుడు ఇక యేది యెలా అవుతే నేమీ? ఇదుగో నిన్ను పంపేస్తున్నాను.

నారాయణమూర్తీ! సూర్యచంద్రులారా! బొబ్బిలిదుర్గాధిదేవతా! నాభర్త చెయ్యవలసిన పనిని నాబిడ్డచేత చేయించండి. అంతే చాలు నాకు. అప్పుడేనా నాయాతన పోతుంది.



"కైజారు పదునుగానేవుంది........శ్రీహరీ!"

వెంకయ్యా! నాదేవుడికి నానమస్కారాలు చెప్పవోయి! మంచిచెడ్డ చెప్పేదే కాని చివరికి మల్లమ్మా ఆజ్ఞని జవదాటేది కాదని చెప్పు. కైజారు పదునుగానే వుంది. లేకపోయినా సాహసం వుంటే తడిపాతే చాలుతుంది యెంతకేనా. శ్రీహరీ!"




(నైషధరచన ననుసరించి)

శ్రీమాన్ కో. వేం. కృష్ణమాచార్యులయ్యవారులు గారు

మామిడిసింగమంత్రి తపమా యిది? యాంధ్రజనోత్కరమ్ముపై
నామురవైరి సేయు కృపయా యిది? నీకనుమ్రోలఁదోఁచి వే
రామెతలిచ్చు వాణియనుమాన యిదో? యిది భట్టహర్షుఁబంచి
న్నామతోచిత్రనాటకము? నైషధకావ్యము నీవొనర్చుటల్.

ఉ. సారవచఃప్రబంధమును సత్కవి నైషధమంచు నాంధ్ర శృం
గారమునా విశేషపదకల్పన నేటికిఁ జేసితివు? సిం
గార మొకింత పూర్వకవికావ్యమునందున లేనిచోట నీ
వా రచియించినావొ? పునరాలపనమ్ముల రూపుమాపితో ?

చ. మునుపటి నన్నపాదికవిముఖ్యులు సంస్కృతకోశజాతముం
దెనుఁ గొనరింపలేదె? భవదీయసుకావ్యమునందుఁ బోలె నం
దునఁ గల యెల్లవాకులఁ దెనుంగొనరించిరె? నూతనంబుగాఁ
దెనుఁగొనరించుశక్తికను దెచ్చితి వీవ యటంచు నెంచెదన్.

ఉ. శ్లోకము శ్లోక మాంధ్రముగఁ జొప్పడకుండిన నుండనీ? కథా
లోకము వృద్ధినాశములలోఁ బడి మ్రగ్గిన మ్రగ్గనీ? ప్రథా
నాకలనీయవృత్తి మొక ప్రాస్త్వతఁ గాంచినఁ గాంచనీ? య
థాం ద్రీకరణమ్మటంచనెడురీతిని మార్చితి వీవు చాతురిన్

ఉ. ఆద్యవచఃప్రబంధములయందు విమర్శ మొనర్చి చూచుచోఁ
బద్యముగాక గద్య మనుభాసనుఁ గానము గాన నీకృతిం
బద్యము గద్యరూపపరివర్తనమందుట హృద్యరీతియో
గద్యములందు నేమిటికిఁ గల్పనఁ జేసితి? శ్లేషభాషలన్

ఉ. శ్లేషవచస్తతిం దెనుఁగుసేయక మానితి? వాంధ్రశబ్దవి
శ్లేష మొనర్చి యేకపదలీననిజాంఘ్రిచతుష్టయాబుధా
త్తోషవిధాయిసూక్తులను దూర్చితి కారణమేమి తెల్పుమా
మాషములం భుజింపు మనుమాటను సింగన విస్మరించెనే ?

శా. అంతం దెల్పితి వాద్యకోశగతపాదాసీకముం జొన్పి ర
వ్వాంతే స్తేయభయంబు లోకభయ మీస్వాంతమ్మునం జేరదే?
యాంతర్యమ్మగు భావముం దెలుపుమయ్యా! వ్యాఖ్య కాంధ్రక్రియా
సంతానమ్మునకున్ విభేదము సతీసాదృశ్యసంభూతమే?

చ. అమృతముఁబోలు శ్లోకముల నాపొసనం బొనరించితేల? ర
మ్యముల విశేషణంబులను మాయఁగఁ జేసితివేల? పాద సం
ఘములను బూర్తిసేయు పెనుకాంతను నీస్వకపోలకల్పితా
ర్థముల వచించితేల? విబుధప్రకరం బిపు డిచ్ఛగించునే?

ఆ. వె. శబ్ద మనుసరించి స్వాంతమ్ము సీక్షించి, రస మలంకృతులఁ గరంబుఁ బెంచి,
అనుచితమును ద్రుంచి ఔచిత్యము గడించి, నైషధమ్ముఁ జేసినావ నీవు?

మ. 'యజమానప్రమదావికస్వరభగస్యస్వాశ్వదీర్ఘస్మర
ధ్వజదండం' బనఁ 'బిప్పలచ్ఛదముఁ గెల్వంగాఁ దలంచెజుమీ
రజనీశామలవక్త్ర' నానుడివినన్ రంజిల్లునే హేయబు
ద్ధి జనింపందగదో? ప్రజాతతికి నెంతే నీవు యోజింపుమా?

సీ. శృంగార మనునుడి చెవి సోఁకినంతనే, వ్యభిచారి కవియంచుఁ బలుకునాఁడు
స్తనము లున్నతముల్ సల్లాపనము విన్న, బూతుకూఁత లటంచుఁ [illegible]కునాఁడు,
'మక్షికీమక్షిని' మదిఁ బాఁ డితోఁడంచు, సారస్య మెఱుఁగక చాటునాఁడు,
ఆయష్టిమిషుఁ డడ్డుబదికాఁడు నిజమని, చేయెత్తి పెద్దలు చెప్పనాఁడు
తే. గీ. పాదపూరణమయమంచు వదలునాఁడు, ప్రతిపదము నాస్తి యనునుడి ప్రబలునాఁడు
తావకీనోక్తిచాతురిఁ దలఁచి తలఁచి, యాత్మ నతివేలహర్షము నందువాఁడ.

సీ. కనకాభిషేకంబుకత నిరామయమయి, యాంధ్రలోకమ్మున నలరుఁగాత!
బూతుల దన్నెదుబుంకు నాశము గాంచి, ప్రాచీనపాఠముల్ ప్రబలుఁగాత
ఒకనుడి దూష్య మంచకట! ప్రబంధమ్ము నశియింప కవనిలోనాటుఁ గాత!
దోషమ్ములం పైన దొఱకుగుణమ్ములఁ, దలపోసి విబుధాళి తనరుఁగాత!
తే. గీ. నైషధాంతర్యక్తముల లక్షణములనరసి, కృతులు గృతులనురహిఁ జెనఁగింత్రుగాక!
శాశ్వతంబుగ శ్రీనాథసత్కవీంద్రుఁ, డమరలోకానఁ గీర్తిచే నలరుఁగాత!




రాయసం వేంకటశివుడు గారు, యం. ఏ., యల్. టి.

## సీతాకాంతుని శోకము

"దుఃఖితే మనసి సర్వమసహ్యమ్." మనసు విచారములో మునిఁగియుండునపుడు లోకమంతయు నసహ్యముగఁ దోఁచును. దుఃఖమును, అకాలవైరాగ్యమును హృదయము నలముకొనుటచేత, మనఃప్రేమకుఁ దానలమగు మనుజులును, మనము కొనసాగింపఁగల యుద్యమములును ప్రపంచమున లేనట్లు గానవచ్చును. ఒకపుడు? భూమియే గొడ్డుపోయి నటు లుండును. కన్నుల కెదురనున్నతలమున నొక పచ్చని మొక్కయైనఁ గానరాక, అంతయు దరిలేని యిసుకయెడారివలె నుండును.

సీతాకాంత మిప్పుడట్టి దుఃఖమున కగ్గమయ్యెను. కొన్ని సంవత్సరముల క్రిందట నతనికిఁ గలిగిన నష్టమపారమైనదే. అది యెంతో వంతగలిగించినను, వ్యాపార సంబంధమగు నష్టమే. కావున శీఘ్రముననె యతఁడు తెప్పరిల్లెను. కాని దానికిని, ఇపుడాతని కాపాదిల్లిన యిక్కట్టునకును బోలికయే లేదు. చేతికెదిగిన చెట్టంత కొడుకు కూలిపోవుటకన్న దురదృష్టమీలోకమునఁ గలదా? వేఱుసంతతి లేకపోవుటయు, తానును, భార్యయు నడివయస్సు దాఁటియుండుటయు వాని దుఃఖమును ద్విగుణీకరించెను. అతఁ డెన్నియో మంచికార్యములు చేసియుండెను. కాని యవియేవియుఁ గుమారుని గండమునుండి కాపాడవయ్యెను! సీతాకాంత మీలోకమున నికఁ జేయవలసిన కార్యము లేవి? లోకమునకు వానికి నిఁక సంబంధ మేమి? "విఫల మనోరథుఁడనైన నే నేల కష్టపడవలయును? ఎవరికొఱకు? భోగములేల? వినోదములు వ్యాపారములు నేల?" అని యతఁడు వైరాగ్యమూని తన యుద్యోగమును, ఇతరులతోడి సంబంధమును విడిచివైచెను. ఇపుడతని వ్యాపారమంతయు పగలెల్ల వాకిట పచారుచేయుటయు, రాత్రులు మంచము గఱచి పట్టుకొని పండుకొని యుండుటయును.

మనుష్య ముఖావలోకనమే సీతాకాంతమునకు దుస్సహమగుటవలన ఎల్లపుడు వారి వీధితలుపు వేసియుండును. కుమారుని మొదటిమాసికమునాఁటి మధ్యాహ్నము [illegible]కోపము విచారమును నాతని మనస్సు నావహించెను. గొడ్డలితీసికొని, దొడ్డిలోనున్న చెట్లన్నియు నతఁడు గొట్టివైచెను. దీర్ఘవిచారముతో ముసుఁగుపెట్టుకొని యరుఁగుమీఁద



బిళ్లగన్నేరు

బందుకొనియున్న జానకమ్మ భర్త చేయుపని గనులారఁ జూచుచుండెను. మగవారికంటె




‘గొడ్డలి తీసికొని, దొడ్డిలోనున్న చెట్లన్నియు నతఁడు కొట్టివైచెను.’

నాఁడువారికిఁ జెట్లయం దెక్కువప్రీతి. ఐనను, చేతులారఁ బెంచిన తనయుఁడే సమసినప్పుడు, ఈపాడుచెట్లు మ్రగ్గుట కావని తా వనటఁ జెందునా? ఇదిగాక తా నెంతటి దుఃఖమున నున్నను, ఒకకంటఁ బతిసేవ మాసాధ్వి గనిపెట్టుచునే యుండెను. తనకడుపుచిచ్చు తుది లేనిదయ్యెను, మీఁదుమిక్కిలి నడివయస్సు దాఁటిన తనభర్త కీవిపత్తుగలుగుట కాయింతి యెంతయు వగచెను. ఆసలన్నియు సుతుని మీఁదఁ బెట్టుకొనిన ముసలివానిసంగతి యిటు లయ్యె నని తలపోయునపుడు, జానకమ్మయుమ్మలిక మధికమగుచుండెను. కావున నీవిధమున నైన నాథుని మనమునకు వ్యావర్తనము గలిగి యతఁడు దుఃఖోపశాంతి గనుచున్నాఁ డని యామె మనస్సును సమాధానపఱచుకొనెను. వృక్షచ్ఛేదనము నెఱపి గొడ్డలి నొక మూలవైచి, సీతాకాంతము కూర్చుండి “అమ్మయ్య! ఇప్పటికైనను! చనిపోయిన తనయునికంటె నీచెట్లెక్కువా? ఇవి యెప్పుడు తమ్మునాటిన వానినే జ్ఞప్తిచేయుచు, మనస్సును బాధించుచుండెను. మొక్కలు మొదలంటఁగోసివైచినమనమిఁక పుత్త్రకునిమీఁది మోహమును మునుముట్ట గోసివేయఁగలము సుమీ!” యని వెఱ్ఱినవ్వు నవ్వి యతఁడు సతి నూరడించెను.

బిల్లగన్నేరు మొక్క

తనహృదయ సీమవలెనే పెరడంతయు నెడారియగుటవలన సీతాకాంతమునకు వెఱ్ఱి సంతసము గలిగెను. ప్రేమ మిత్త్రత్వముల కీ ప్రపంచ మనువగు ప్రదేశముగానట్టె పచ్చని యాకుగాని, ఎఱ్ఱనిపూవుగాని తలచూపుటకు తమదొడ్డి యుచితప్రదేశము గాదని యతఁడు నిర్ధారణము చేసికొనెను. ఏమూలనో గడ్డిమొలక యొకటి గానవచ్చినా నచటికిఁ బోయి దానినిఁ బెఱికివైచినఁగాని సీతాకాంతముమనసు కుదుటఁబడదు! ఒకనాఁ డితఁడు వాకిటఁ దిరుగుచు దూరమున నొక పచ్చని మొలకఁజూచి, యాగ్రహావేశ పరవశుఁడై, యింటిలోనికిఁజని కత్తితీసికొని, వేవేగమే యాతావునకుఁ బోయెను. దైవ వైపరీత్యమునఁ బతికిఁ గలిగిన తాత్కాలికమగు నీమతిభ్రమణమున కచ్చెరువందుచు జానకమ్మ భర్త

చుండిరి. తమ తోఁటకుఁ గొమరుని నామమే యొసంగిరి.

కుక్క పిల్ల

ఈవ్యాప్తి వలన నాదంపతులు కొంత దుఃఖోపశాంతి గాంచియున్నను, ఇంకను వారు పీఠ ముఖము చూచుటకు సాహసింపరైరి. ఇటీవల వారు పూనిన వైరాగ్యమే దీనికిఁ గారణము. మనస్సంకల్పితములగు సంకెలలు పెనుచుట కష్టము. ఒకనాఁడు, సీతాకాంతము వాకిటఁ దిరుగుచు నొక కుక్క మూలుగు వినెను. ఆ యార్తనాదము రాత్రియంతయు ఆదంపతుల వీనులకుఁ దగులుచుండి వారినిద్దురఁ బాపెను. ఉదయమునకుఁ దా మాకుక్క సంగతి కనిపెట్టుకొనుటకు వారంత వెతఁజెందిరి. వేకువనె సీతాకాంతము వీథితలుపు తెఱచి, గాయముచే మూలుగుచున్న యొకకుక్కపిల్లను జూచెను. గోతిలోనుండి యాకుక్కపిల్ల నీతఁడు వెలికిఁదీసి బయట గడిగి తెచ్చి, గాయము పరీక్షించుచుండ గా చుట్టుపట్టులవారు వచ్చిరి. రెండుదినముల క్రిందట బండిచక్రము దానిమీఁదుగాఁ బోవుటచేత కుక్కపిల్లకా లిప్పుడు వాచియుండెనని వారు చెప్పిరి. మనుష్యుల బాధలే లెక్కచేయని లోకులు కుక్కల బాధలు పాటింతురా? కావున చేయూతనొసఁగువారు లేనందున నాకుక్కపిల్ల బాధనుఁ గొట్టుకొనుచుండెను. సీతాకాంతమప్పుడు దానిని బశువైద్యశాలకుఁ గొనిపోయి, యచట దానికిఁ గట్టు కట్టించెను. ఆతఁడిట్లు వెంటనె యానోరెఱుఁగని జంతువును గొనిరానిచో బాధ మితిమీఱి, చికిత్స యసాధ్యమై యది చనిపోయి యుండెడిదని వైద్యుఁడు చెప్పి, వాని భూతదయ నభినందించెను. కొన్నిదినము లిట్లు కుక్కనిమిత్తమై తిరుగుచు సీతాకాంతము లోకవ్యవహారములఁ బాల్గొన నారంభించెను. అంత నొకనాఁడు మధ్యాహ్నము వీథితలుపునొద్ద శబ్దము విని తలుపుతీయగా స్వస్థపడి వచ్చిన కుక్కపిల్ల సీతాకాంతమునకుఁ గనఁబడెను. అది తనదారిని దానుబోక, తోఁక నాడించుచు రక్షకునియెడ ప్రేమ కృతజ్ఞతలు దెలుపుచు వానితో లోనికి వచ్చెను. మృత్యువునోటినుండి తప్పించుకొనిన యాకుక్కమీఁద నాగృహస్థులకు జాలి పుట్టి వారు దానినిఁ బోషింపఁదొడంగిరి. క్రమక్రమముగ వారికి శునకము మీఁదఁ బ్రేమ పెరిగెను. సంసారమునందలి తగులాటము లిటుల



"సీతాకాంతము కుక్కపిల్లను...... వెలికిదీసి...... గాయము పరీక్షించుచుండగా... చుట్టుపట్టులవారువచ్చిరి"

నానాఁట విజృంభించి, తమ వైరాగ్యమును వారఁ ద్రోలుచుండుట కాదంపతు లాశ్చర్య



"తలుపుతీయఁగా... కుక్కపిల్ల సీతాకాంతమునకుఁ గనఁబడెను"

పడియు, చేయున దేమియు లేక, నియతి కార్యములే చేయుచుండిరి!

శాంతమ్మ

చేతులకుఁ దగినంత పనియున్నను, ఆదంపతుల మనస్సు మాత్ర మొక్కతటి పూర్వపు దుఃఖవిషయమునకు మఱలుచుండెను. కాని వారి హృదయక్షేత్ర మిపుడు నిర్జలప్రదేశము గు నెడారి కాక, ప్రేమనదీ జలార్ద్రమయ్యెను. ఆదయాంబువులఁ గ్రోలి జీవించున విపుడు కొన్ని చలన మెఱుఁగని చెట్లును, నోరులేనిజంతువులును! మనుజుల కాదయామృత మింకను లభ్యము కాకుండెను నరుల కృపాకృతజ్ఞతలయం దాదంపతులకు నమ్మకము సడలిపోయి, వారు తమదయకు యోగ్యులు కారని భావించిరా యనునట్టు లింకను వారి వీథి తలుపు నిరంతరము మూయఁబడియే యుండును! ఒక నాఁడెవరో వచ్చి పిలుచుటచేత వారు తలుపు తీసిరి. వచ్చినవారు శాంతమ్మయు కుమారుఁడును. చిన్ననాఁడు బీదస్థితియం దుండునపుడు శాంతమ్మ కాదంపతులు మిక్కిలి సహాయము చేసిరి. వారివలననే తన విద్యాపరిపోషణ మయ్యెనని గుర్తెఱిఁగి తాను జేయఁగల సహాయ మీకష్టసమయమున వారికిఁ జేయుటకే, భర్త యనుమతిఁగైకొని యిపుడా కాంత కొంతకాలము పీరిని గనిపెట్టుట కిచటికిఁ బిల్లవానితో వచ్చెను. పరామర్శమను పేరుతో విందు లారగింప శాంతమ్మ వచ్చియుండలేదు. వాఙ్మాత్రముననఁగాక, క్రియారూపముననఁ దనభక్తి ప్రేమలచే నాదంపతులను బూజింపవలయు ననియే యాకోమలి యిపుడు వారియిలు ప్రొక్కుకొనివచ్చెను!

వారువచ్చిన కొంతతడవునకు శాంతమ్మయు జానకమ్మయుఁ గలసి ముచ్చటలాడుచుండిరి. నాలుగైదేండ్లు వయసుగల శాంతమ్మ చిన్నికుమారుఁడపుడు వాకిటనున్న పిల్లగన్నెరుపూవులఁ గోసి, తప్పటడుగులతో నడచివచ్చి, "తాతా! ఇదుగో!" యని సీతాకాంతమున కొక పూవిచ్చి, అమ్మమ్మచేతి నొకటి యుంచెను. ఇది యత్యల్పమగు సంగతియే. కాని, మనజీవితమునందలి పరిస్థితుల ననుసరించి, స్వల్పవిషయములె ఘనమైన విగఁ బరిణమిల్లుచుండును. దైవోపహతులగు నాదంపతుల కీబాలకుఁ డిచ్చు రెండుచిన్నపూ

పులును, అరవిరిసియున్న తమహృదయములకుఁ బరిపూర్ణోన్మీలనము నెలయించుఁ బరమేశ్వరుఁ డొసఁగిన రెండుదివ్యసాధనములాయనునట్లు తోఁచెను! పిల్లవానిని నాఁడిరువురు ముద్దుపెట్టుకొనిరి. చిరకాలమునుండి నిమగ్నులై వారిహృదయములందు ప్రేమాదిసద్గుణములు పల్లవింపఁజేయఁ బ్రయత్నించుచుండెను.

కొలఁదిదినములలోనే తాతమనుమలకు, పసామోలోను గనునట్టసంతటి సుస్నేహము వాటిల్లెను! (అనుభవజ్ఞుఁడగు తాత యిపుడు చిన్నమనుమఁడు, ప్రశ్న-ప్రశ్నకుపై ప్రశ్నములు వేయుచుండును. చిన్నచిన్న పనులందుఁ దాతకు మనుమఁడు కుడిభుజమయ్యెను. చిన్నమనుమనికి కట్టి కథలు చెప్పి యెట్టి వినోదములు గల్పింతమా యని తాత యహర్నిశ మాలోచించుచుండును. ఇట్టి నూతనప్రేమకుఁ దావలమైనదగుటవలననే, సీతాకాంతుని మనోగగనమిపుడు దుఃఖమేఘవిముక్తమై, సంతోషదీప్తులతోఁ దేజరిల్లుచున్నది. బాలకుని జూచుకొనుచున్న యానందమున సీతాకాంతుఁడిపుడు తన దుఃఖమును మఱచిపోయెను.


"తాతా ఇదుగో"

యాదంపతులు క్షణకాలము తమచింతమఱచి యెదుటనున్న బాలకుని ముద్దాడిరనిన, మానవహృదయము, దుఃఖాంధకారముచే నెంత యావరింపఁబడినను, మినుకు-మినుకు-మను నానందజ్యోతి దానియందింకను వెలుంగుచుండునియే మనము గ్రహింపవలయును! ప్రేమామృతమింకను, ఆహ్లాదయములు నిగిరిపోలేదనియే మనము భావింపవలయును. ఇట్టిసంగతులు పరికించి సంతసించిన శాంతమ్మ, తన యుపచారమువలన నింకను వీరిని సేదదేర్చి, క్రమముగా తనసాంఘికజీవనమును దిరిగిపాల్గొనుచు, పరోపకారకార్యనిమగ్నురాలై యుండెను. విరక్తియందుఁ దాఁజిక్కుకొని యుండునపుడు తనకన్నులు విప్పి చరణములను దర్శననిద్రవఁ బ్రోక్కించి, చేయూఁతనొసంగిన నారి నందకిని తనకుఁ దరణోపాయమును జూపినవారని యతఁడు భావించును. (శాంతివిషయములే తనకన్నుల పొరలూడ్చెనని యతఁడు చెప్పుకొనుచుండును. కావుననే పిల్లగన్నెరు

మొదలైన వానికి దానిసేయుఁ గల్పవృక్షము నయ్యెను!

ఇప్పుడు శాంతమ్మగారు మహిళాభ్యుదయమునకు గూడ తమకుఁ గొనుచున్నది! ఆమెయొక్క ప్రోత్సాహమున నే జానకమ్మ దేశమును గాంచుకొని, క్రమముగ దేశహితైక కార్యములలో నభిరుచి గలది యయ్యెను. నగరమందలి [illegible] [illegible] కమ్మగారు కార్యదర్శినిగా నుండి నడిపెడి సకల సత్కార్య సమాజములకును వారియిల్లే యిప్పుడు కేంద్రస్థానము!



# యమునాప్రాభవస్మృతి

పండిత పెనుమత్స సత్యనారాయణరాజు గారు

అమలాత్ముండగు నుద్ధవుండును భృగుజద్వ్యాసాది మర్త్యజ్ఞులున్
గమలానాథుని బాల్యచేష్టలెచటం గావించె సానందుఁడై
ప్రమదానందముఁ గని తత్స్థలంబులు జలప్రక్షాళితాఘౌఘమై
యమునా! నీవగు సైకతస్థలు లటం జక్రుల్ ఘెరన్ రాల్చెదన్

గీ. పెరిఁగి పెద్దయై యేతీర పరిసరమున, నస్త్రశస్త్రాదివిద్యల నభ్యసించె
నందనందనుఁ డాతీరమందె తాను, యమునఁ గని నేను పులకించు నమ్మ, యమున!

గీ. భవ్యభవదీయ సైకత పటలితోడ, దనదు నేచాయ లెంతయు మొనసి గొండ
జాములకొలంది నీనీట స్నానమాడు, బాలకృష్ణుండు తజ్జలమాల సిరి.

గీ. ఏని పావనోదకములచే ననాథు, లైన పాండవుల ప్రతప్తమానసములు
శాంతి పొందింపఁబడియెనో యంత లుసుగ, నామహానది వగుదమ్మ, యమున! నీవె?

గీ యమునరో! దేవకీదేవి యఖిలవేది, నిఖిలజగదంతరవ్యాపి నీరజాక్షుఁ
డైన శ్రీకృష్ణు నుదరమ్ములోన నెమ్మి, నిడికొని యెటకుఁ గ్రుంకిడ నేఁగుదెంచు
నామహాపవిత్రాంగ వగుదు నీవ.

. ఆనందాశ్రులు గన్నులన్ వెడల రోమాంచంబుతో నీశ్వర
ధ్యానారూఢమహావ్రతాంతరాళ యగుచుం డా దేవకీదేవి లో
నే నీతీరమునందు గర్భగతుఁడై నిందీవరశ్యాముకున్
నానార్థంబుల సృద్ధిఁ గోరునపుడైనం బుట్టునె తీన్ నదీ!

సీ. ప్రాకారసంశోభితాకాశవాహిని, నీకాశ శ్రీధ్వజానీకములును
కాంతాజనస్వాంతకాంతిలతాక్రాంత, ప్రమదావనానూన సముదయంబు
నైజకాంతిచ్ఛటా నైగనిగ్యవిజిత, చంద్రమండలమహాసౌధములును
హరివాహఘనకంఠి నరమాదరాచల, రంగద్విలోలచతురంగబలము

గీ. కలిగి యొప్పారు కోటలఁ గట్టి రెచటఁ, గోర్కి వ్రాయఁబెట్టి కోటాను కోట్లు ధనము
పాండవులు దండకాటవి నటలి నజుకి, యామహానదీరత్నమ నమ్మ నీవు!

*        *        *        *        *        *

అట్టి నీస్వరూపముఁ గాల మట్టిమార్చె, నాపదల కోర్చి నీకటు ఁగిలిపోయె
గన్ప్రముఖబింబ మొంతయుఁ గమలిపోయె, రమ్యభ్రూయుగ్మరోమముల్ రాలిపోయెఁ
బద్మసన్నిభనేత్రముల్ వాఁడిపోయెఁ, జారుఫాలస్థతిలకమ్ము జాఱిపోయె
నవనికిసుకోమలదేహ మవసిపోయె, ఏమిచిత్రంబొ యమునరో యెఱుఁగలేము
నీదు తీరమ్మునందున నేఁడు చూడ, నట్టిపట్టన మొక్కటి యైన లేదు
అట్టి సౌధావాస మొక్కటి యైన లేదు, అట్టివైభవ మిసుమంత యైన లేదు
అట్టి సత్ప్రతాపఠీవి మసలు లేదు, అట్టియోధకదంబమ్ము కట్ట! లేదు
అట్టి త్రిజగదారాధ్యరాజ్యంబు లేదు, అట్టి భక్తచాతకకంద మయ్యో! లేదు

*        *        *        *        *        *

కర్కశాత్మకులు తురుష్కముష్కరులును, తాస్తరీయులు నిఖిలజనార్తికరులు
ఆగమధ్వంసకులగు నామొగలువారు, దోసకారులు ఘనులు పరాసువారు
పరుషకరవాలధారల నఱికినట్టి, నీదు కాయంబు గాయముల్ బాధవెట్ట
నదరుగుండె బెదరుగుండె యగుట నయ్యొ, చెదరిపోయిన ముంగురుల్ చెదరియుండ
బెదగుమాపులు చూచుచుఁ బెదవు లెండ, స్వస్థతం జెందలేకిటు శ్వాసములను
దల్లి! యమునరో! విడువంగఁ జెల్లు నమ్మ!!



# ప్రాచీనవృత్తివిద్యాభిధానము

మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

పూర్వము వేదములు, శాస్త్రములు మొదలగు వైదిక విద్యలన్నియు బ్రాహ్మణుల యధీనమున నుండెను. మిగిలిన విద్యలు అనగా కమ్మరము, కుమ్మరము, కంచరము, నగలు నాణెములుచేయుట, ఇండ్లు మిద్దెలు మేడలు కట్టుట, వంతెనలు కట్టుట, చిత్రములు వ్రాయుట, దేవాలయములు గోపురములు నిర్మించుట, రథములు బండ్లు చేయుట ఈ మొదలగునవన్నియు ద్విజేతరుల యధీనమున నుండెను. బ్రాహ్మణ,క్షత్రియ,వైశ్యులు ద్విజులు. ద్విజులుగ పరిగణింపబడని చతుర్థవర్ణమున జేరువారు పైనుదహరించిన యట్టి పారిశ్రామికవిద్యలకు అధికారులుగ నుండిరి.

### వృత్తివిద్య, కులములు

ఒక్కొక్కవృత్తి నవలంబించువారు ఒక్కొక్కసంఘముగా నేర్పడిరి. ఇట్టిసంఘములకే కులములనిపేరు. ఇప్పటి కులములన్నియు వృత్తుల ననుసరించి యేర్పడినవే. ఒక్కొక్క కులమువారు ఒక్కొక్కవిద్యను కాపాడి పోషించుచువచ్చిరి. అందువలన నట్టి కులములవారు రక్షించి పోషించినవగుటచేత అట్టివిద్యలకు కులవిద్యలనియు, వేఱువేఱు వృత్తులకు సంబంధించిన వగుటచేత వృత్తివిద్యలనియుపేరు. ఈవిధమైన విద్యనే ఇప్పుడు సాంకేతికవిద్య (Technical Education) అందురు.

ఇట్టి వృత్తివిద్యను నేర్పుటకు పూర్వము మనదేశమున నిప్పటివలె కళాశాలలుకాని, విద్యాలయములుకాని ఉండెడివికావు. ఆయా కులములలో వృద్ధులైన వారు- నిపుణులైన వారు తమతమ కర్మశాల (Work shop)లందే తమతమకులములలోని బాలురకు విద్యాప్రదానము గావించువారు. అందువలన నట్టి బాలురు పొందువిద్య స్వానుభవముతో కూడి ప్రపంచమునకు ఉపయోగపడునట్టిదిగ నుండును. చాలకాలము ఇట్టివృత్తివిద్య నేర్చుకొనువిద్యార్థి వినయవిధేయతలవలనను, అవ్యాజగురుభక్తి శ్రద్ధలవలనను తనయజమాని యైన గురువు యొక్క మనస్సు రంజించి ఆతని మెప్పించినచో ఆతనివివేకమును, శ్రద్ధను, ఆసక్తిని కనిపెట్టి ఆతడావిద్యార్థికి వృత్తిరహస్యములను, ఆవృత్తిలోని విజ్ఞానరహస్యములను ఉపదేశము చేయువాడు. అందువలన తన వృత్తియం దేమాత్రమభిమానమున్నవాడైనను, ఆవిద్యను నేర్చుకొనవలెనని యేమాత్రము దీక్షపట్టినవాడైనను ఒడలు వంచి వినయ విధేయతలతో పనిచేసి తనగురువును మెప్పింపజూచువాడు. విద్యార్థి యేమాత్రము విద్యనేర్చుకొనినను స్వానుభవ పూర్వకముగ పడసినవిద్య యగుటచేత నాతడు తన జీవయాత్ర సుఖముగ గడుపుకొనుట కది

తోడ్పడుచుండెను. ఏయేవృత్తిలోనైనను నిపుణులైనవారుఎచ్చటనున్ననుఅచ్చటికేగి విద్యార్థులు విద్య నేర్చుకొనుచుండువారు. తండ్రియొద్ద కొడుకువిద్య నేర్చుకొనినను, అన్నయొద్ద తమ్ముడు నేర్చుకొనినను నేర్చుకొనునంత కాలము బంధుభావముతో గాక గురుశిష్యభావముతోనే వారు కాలము గడపువారు. అందువలన కర్మశాలలో పనిచేసినందుకు తండ్రి కొడుకునకుగాని, అన్న తమ్మునికిగాని జీతమొసంగువాడు; కాని శాల వీడి యింటికివచ్చినచో ఇంక వారు గురుశిష్యులు గారు—తండ్రి కొడుకులే; అన్న తమ్ములే. సాధారణముగ హిందువులది సమష్టికుటుంబము గనుక కర్మశాలలో తండ్రియిచ్చిన జీతమును కొడుకును, అన్నయిచ్చిన వేతనమును తమ్ముడును ఇంటికివచ్చినపిదప మరల బంధుభావమున వరుసగా తండ్రికిని, అన్నకు నిచ్చివేయువారు: ఇంటియొద్ద బంధుభావసరళి; కర్మశాలలో గురుశిష్య సంబంధము. అందువలన నీవృత్తి విద్యలన్నియు పూర్వము తండ్రినుండి కొడుకునకు, అన్ననుండి తమ్మునకు ఈవిధమున వంశపారంపర్యముగ వచ్చుచుండెడివి. ఒక్కొక్కవృత్తిలో పనిచేయు కులమువారు ఆవృత్తినే కాని, అనగా ఆకులముయొక్క విద్యనే కాని యితరవృత్తులనుగాని, యితరకులవిద్యలనుగాని నేర్చుకొనగూడదు. తనకులవిద్యనువిడిచి ఇతరకులవిద్యను చేపట్టుట కులద్రోహముగ పరిగణింపబడుచు వచ్చెను. స్వధర్మమే శ్రేయోదాయకము; పరధర్మము భయావహము; కావుననే పరధర్మ మాచరణయోగ్యము కాదు. ఇట్టి అభిప్రాయమును నమ్మకమును ప్రబలముగ వ్యాపించి యుండుటయే

చెలివిద్య లెన్నియైనను
కులవిద్యకు సాటిరావు కుంభినిలోనన్
వెలకాంత లెంచఱున్నను
కులకాంతకు సాటిరాదు గువ్వలచెన్నా!

మున్నగు పద్యములు పుట్టుటకు కారణమయ్యెను. ఈవిధమున నాయాకులములవారు తమతమ కులముల కేర్పడిన విద్యలను ప్రాణతుల్యముగ నెంచి పోషించుచు వచ్చిరి. ఆయాకులములకు సంబంధించిన కర్మశాలలే వృత్తివిద్యాలయములుగ నేర్పడెను. అట్టి విద్యాలయములే గొప్ప పారిశ్రామికనిలయములై పేరుగాంచి దేశైశ్వర్యమును పెంపొందించెను. నేటివలె భౌతికశాస్త్ర విజ్ఞానము వికసింపని ఆ 'మోటు' దినములలోనే ప్రపంచ మంతటిలో పేరుపడిన వస్తుజాలమును తయారుచేసి హిందూదేశపారిశ్రామికుడు ఖండాంతరుల చేతగూడ సంస్తుతులను బొంది, పల్లెటూరిలోని తనచిన్న కుటీరముముందు తనవృత్తివిద్యాపైపుణ్యమునకు గర్వసూచకముగ విజయస్తంభమును పాతి దానికి కీర్తిపతాక ప్రేలగట్టియున్నాడు.

ఎన్నెన్ని వృత్తులు కలవో మన దేశమున అన్నన్ని పరిశ్రమలుకలవు. వీటిని నడపునది జీవములేని యంత్రములుగాక బుద్ధివైభవమును, ప్రతిభాసంపదయుగల దివ్యచైతన్యాంశాసంభవుడగు మానవుడగుటచేత అవి పారిశ్రామికకళలై పరిఢవిల్లెను. హిందూదేశపరిశ్రమలను గురించి యిచట వ్రాయుట అనవసరము.

### కులసభలు, నిధులు

స్వధర్మసంరక్షణమునకై ఈకులములకు కులసభలు, పంచాయతులు నుండెడివి. హిందూ ధర్మశాస్త్రములు కూడ ఈకులసభలను గౌరవించి, ఆయా కులములకు సంబంధించిన వివాదములను పరిష్కరించుపద్ధతి వాటికే వదలి పెట్టెను. పూర్వము ధర్మశాస్త్రకారులకు ఈవృత్తులయం దెంతటిగౌరవము కలదో ఈవిధమైన ధర్మశాస్త్రనిబంధనలను గాంచిన తెలియగలదు. ఈకులములవారికి సభలుమాత్రమేకాక ప్రత్యేకము నిధులుకూడ నుండెడివి. ఈనిధులు ఇప్పటి బ్యాంకులవంటివి. రాజులు మొదలగువారు ఎవరికైన ఒక్కకులమువారు లేక ఒక్కవృత్తివారు తయారుచేసిన పారిశ్రామిక సంపదను దానముచేయ దలచినను, ఆదానము ఆచంద్రార్కముగ సాగుచు, శాశ్వతముగనుండవలెనన్నను ఎంతో కొంతమూలధనము-అనగా తాము దానము చేయదలచిన దానివిలువకు సరిపోవునవడ్డీ నొసంగు మూలధనమును—ఆకులమువారినిధిలో వేయువారు. అట్లుచేసిన ఆమూలధనముమీదవచ్చువడ్డీతో నాధర్మము ఆచంద్రార్కస్థాయిగ నడచుచుండెడిది. ఈవిధమైన పద్ధతి మూలమున రెండు లాభములు కలుగుచుండెను. (౧) ధర్మము ఆచంద్రార్కస్థాయిగ సాగుట, (౨) ఆమూలధనమువలన పారిశ్రమ అభివృద్ధి గాంచుట. ఈవిధమైన నిధులు, నిబంధనలు క్రీస్తుశకారంభమునకే, అనగా ఆంధ్రరాజులు పాలించు నాటికే కలవు. క్రీస్తుశకారంభకాలమునాటికే ఆయావృత్తి సంఘములు, అనగా కులములు చక్కని వికాసముకలిగి అభివృద్ధి గాంచినవి.

ఏవృత్తి కావృత్తియే చాలగౌరవప్రదమై నదిగ నెన్నబడుచుండెను. హిందూసంఘమున పూర్వ మిట్టివృత్తులవారికి గౌరవస్థానముండెను. ఈవిషయము ప్రాచీన హిందూగ్రామవ్యవస్థను పరికించినచో సువ్యక్తమగును. వ్యవసాయకప్రజాతియగుటచేత హిందువులు ముఖ్యముగ నూటికి తొంబదితొమ్మిదివంతుల గ్రామములలోనే నివసించువారు. హిందూసంఘ పరిపాలనమునకేమి, మఱియితర విషయములకేమి పూర్వము - పూర్వమేల యననేల ఇప్పటికి—గ్రామమే ప్రాతిపదిక. హిందూదేశమునంతను కంపింపజాలు ఏవిద్యుత్సంచలనము కలిగినను అది గ్రామమునుండియే ప్రాదుర్భవించుచుండెను. ఏసంస్కర్తకాని, ఏరాజకీయ తంత్రజ్ఞుడుకాని పూర్వము ప్రకృతియొక్క పాలబుగ్గలపల్లెటూరిని లాలింపగలిగెనా, ఆతడు హిందూదేశమునంతను పరిపాలింపగలబలము సంపాదించినాడన్నమాటయే. పూర్వము, మనస్సు నుప్పొంగారజేయునట్టి హిందూసంఘమహాదుర్గమును,మహాసంస్థయునైన గ్రామమున'కులపతి'యైన పారిశ్రామికుడు ప్రధానస్థానమును సంపాదించెను. పారిశ్రామికుడు లేక ఏసంఘమును ఏకాలమునను అభివృద్ధి చెందలేదు.

### బ్రాహ్మణవిద్య, వృత్తివిద్య

బ్రాహ్మణుడు తనవశమునయున్న వైదిక విజ్ఞానము ప్రజలకొసంగినను పారిశ్రామికుడు ములేనిచో నిలువనీడయుండునా? భోజనాదిము

లమర్చుకొనుటకు ఉపకరణములును సాధనములు నుండునా? పారిశ్రామిక విజ్ఞానము లేనిచో ఆధ్యాత్మికజ్ఞాన ముండియు సంఘము అభివృద్ధి నొందజాలదు. ఆధ్యాత్మికవిజ్ఞానము లేని పారిశ్రామికజ్ఞానము అపాయకరము. ఆధ్యాత్మిక, పారిశ్రామిక విజ్ఞానములు రెండును ఒకదానిలో నొకటి అంతర్భాగములు. వీటిలో ఏది కొఱవడినను రెండవదానికి ప్రశస్తిలేదు. పారిశ్రామికవిజ్ఞానము సుందరమైన, వ్యావహారికమైన నాగరికతను సృష్టించుచుండ ఆధ్యాత్మికవిజ్ఞానము దానికి తేజస్సునొసగి ప్రాణము పోయుచున్నది. హైందవ నాగరికతయెంతయు పల్లెటూరి. పారిశ్రామికుడు చిన్నకుటీరమునుండియు, నిరాడంబరజీవియు ఆధ్యాత్మిక విద్యానిపుణుడైన అగ్రహారికునినుండియు పెరిగి పెంపుగాంచినది. ఈ రెండువిధములైన జ్ఞానవిభాగములకుగల అన్యోన్యసంబంధమును గుర్తెరింగినది కనుకనే మనప్రాచీనగ్రామమీరెంటికి ప్రధానస్థానమొసంగి సఖ్యత నమకూర్చినది. కావుననే మన ప్రాచీన గ్రామవ్యవస్థలో వైదిక విద్యానిపుణుడైన బ్రాహ్మణుని కెట్టిస్థానము గలదో అట్టిస్థానమే వృత్తివిద్యానిపుణుడైన పారిశ్రామికునికి నుండెను. ఈవిధముగ ప్రాచీనగ్రామము ఈ రెండువిధములైన విజ్ఞానమును సమన్వయముచేసి నేటిపారిశ్రామికసమస్యను, దానికి సంబంధించిన యితరములైన చిక్కులను'ఆధునికనాగరికత'కన్నులు తెరపకమునుపే చక్కగ పరిష్కరించెను. పారిశ్రామికునికి గ్రామవ్యవస్థలో 'వృత్తి'రూపమున స్థానముండుటచే వృత్తివిద్య కెట్టిగౌరవముండెడిదో తెలియగలదు. పూర్వము బ్రాహ్మణుడు, పారిశ్రామికుడు—ఇరువురును హిందూసంఘమునకు రెండు కండ్లవలెనుండి పరస్పరము సహానుభూతిని కలిగియుండుట నేర్చుకొని, ఆధ్యాత్మికవిద్య కధికారులై ఉన్నతాదర్శములనుజూపి మానవునియందలి ఆధ్యాత్మిక సంపదను దోహదముచేసి యొక్కరును, ఆధిభౌతికవిద్యకు ఆచార్యులై సౌందర్యరస పరిప్లుతములగు కళారచనలను గావించి జీవితమును సౌభాగ్యానంద ప్రదముచేసి మరియొక్కరును సంఘమును నడిపించి దేశమును పరిపాలించువారు.

### 'భటవృత్తి' మాన్యములు, గ్రామవ్యవస్థ

ఈ పైకారణములమూలమున ప్రతిగ్రామమునను కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, కంసాలి ఈ మొదలగు వారికందరికి వృత్తు లుండెడివి: అనగా వారికి మాన్యము లుండెడివి. గ్రామము ఏర్పాటగునప్పుడే ఈవృత్తు లేర్పడుచుండెడివి. ఇట్టివృత్తులవా రుండుటవలననే పూర్వము ఒక గ్రామము ఇంకొకగ్రామముమీద నాధారపడవలసిన అవసరము లేకపోయెను. గ్రామసంఘమున కాయావృత్తులవారు భటులుగ నుండి సంఘశరీరమును కాపాడువారు. కావుననే ఆయావృత్తులవారి కేర్పడిన మాన్యములకు 'భటవృత్తి మాన్యము' లనియు, 'జాతికట్టు మాన్యము'లనియు పేరు. పూర్వము గ్రామమే కాక గ్రామమునందలి దేవస్థానముకూడ ఆయావృత్తులవారికి మాన్యము లిచ్చి గౌరవించి పోషించుచుండెడిది. దక్షిణదేశమున నేమాత్రము ప్రసిద్ధికెక్కిన దేవాలయమున నైనను

కమ్మరి, కుమ్మరి, కాసె (తాపీపని) వాడు, వడ్రంగి, స్వర్ణకారుడు వీరలెల్లరుకూడ నుండు వారు.[1] ఇట్లు మహాసంస్థయైన గ్రామమును, అందలి ఉపసంస్థయైన దేవస్థానమునుకూడ ఆ యావృత్తులవారికి తమతమ విద్యలలో గడి తేరుటకును, చేయితిరుగుటకును ప్రాథమికా భ్యాసశాలలుగ నుండెడివి.

గ్రామవ్యవస్థ ఆయా వృత్తులవారు వారివారి విద్యలలో నిపుణు లగుటకు ఈవిధ మున అవకాశమిచ్చుచుండ ధనికులు, సామం తమండలేశ్వరులు, మండలేశ్వరులు, రాజులు మొదలగువారు నూతులు త్రవ్వించియు, చెరు వులుకట్టించియు,గుళ్లుగోపురములు నిర్మించియు ఈవిధమున పనివాండ్రకు తమ పనితనము చూపుటకు అవకాశ మిచ్చి ఆదరించువారు. పనివాడు తనపనితనమును జూపి తనకృతిపతిని మెప్పించినచో ఆతడు ఆవృత్తివిద్యావిశారదు నకు కొంత భూమిదాన మొసంగువాడు. ఇట్లు పూర్వము పారిశ్రామికులైన విద్యావంతు లకు కళాభిరుచిగలవారు భూమి రూపమున నొసంగిన బహుమానదానశాసనము లనే కము కాన్పించుచున్నవి.[2] ఇట్లు భూరూపబహు మానముల నొసంగుటయే కాక వారిపనితన మును మెచ్చుకొని విద్యాప్రియులైన ప్రభు వులు సాంఘికముగ వెనుకబడియుండువారికి కొన్ని కొన్ని స్వాతంత్ర్యమర్యాదలను కూడ నొసగ్గి సంఘమున వారికి గౌరవోన్నతస్థాన ముల నొసంగి, క్రమక్రమముగ సంఘమున వారిమర్యాద హెచ్చునట్లు చేయువారు. ప్రాచీ నశాసనావళిని గాంచినచో మనకిట్టి శాసనము లును గానబడును.[3] అనగా నాయావృత్తు లలో విద్యావంతులైనవారిమూలమున ఆయా కులములకు హిందూసంఘమున గౌరవము హెచ్చుచు వచ్చెను. విద్యావంతులు ఆయా కులములకు జీవగఱ్ఱవలెనుండి దేశమును సౌభాగ్యవంతముగ దిద్దుటకై తమ మేధాశక్తి ని, ప్రతిభాసంపదను వినియోగించువారు.

పంచాణంవారు, వారిపనితనము

లలితములైన పారిశ్రామికకళలను పోషిం చి, కాపాడి దేశమునకు సౌభాగ్య సౌందర్య ములను ఒనగూర్చినవారు ఈ పారిశ్రామిక జాతులవారే. వీరిలో 'పంచాణం' వారు అన బడు విశ్వకర్మవంశజులు ముఖ్యులు. బ్రహ్మ కుమారుడైన విశ్వకర్మకు అయిదుగురు కొడు కులుకలరు. వారైదుగురు అయిదువృత్తులకు కారకులైరి. ఆవృత్తులేవన (౧) కమ్మరము,(౨) వడ్రము, (3)కంచరము, (౪)శిల్పము,(౫)స్వర్ణ కారకము(కుందనపుపని). ఈయైదువృత్తులవారి కి విద్దాయులనియు పేరు. శాసనములలో వీరు 'పంచాణం' వారనుపేర బరగుచున్నారు. వీరు తమపేళ్ల చివర 'ఆచారి' పదము చేర్చుకొందు రు. పూర్వపు శాసనములలో వీరిపేళ్ల చివర 'ఆచారి'పదముకంటెను 'ఓజు' పదము ఎక్కు వగ గన్పట్టును: వల్లభోజు, బస్వోజు, దేవోజు,

1. Ep. Coll. No. 729-1930; Ep. Coll. No. 674-1920; Ep. Ind. Vol. V. P. 142; S. I. I. Vol. II. Part III. No. 66; Ep. Coll. No. 157-1913. Etc.

2. Ep Coll. No 436-1920; Ep Coll 683-1917 Etc.

3. S. I. I. iii, i, 47, 1899; Ep. Rep. 1911 p 75 Etc.

ఇట్టి పేరులు శాసనములలో చాలవచ్చును. తామ్రశాసనములనుకూడ వీరే చెక్కువారు. కళింగ గాంగుడగు మూడవవజ్రహస్తుని దాన శాసనముల యుత్కీర్ణకులలో మహాత్ము శాలులు మేంటోజు, నూకమోజు, వల్లేనోజు నను వారు కలరు.

గుంటూరు మండలములోని పల్నాటి తాలూకాయందలి మాచెర్లగ్రామమున ఆదిత్యేశ్వరాయలమునందున్న శాసనములలో కొన్ని యీవిశ్వకర్మకులజుల ప్రశస్తిని తెలుపుచున్నవి. ఆశాసనములలో పేరెన్నిక గన్న విశ్వకర్మవంశోద్భవు లైన కొంద ఱాచార్యులు కూడ పేర్కొనంబడియున్నారు. వారు శివలింగములను మలచుటలోను, విగ్రహములను చెక్కుటలోను, చతుర్విధప్రాసాదాదులను నిర్మించుటలోను, వాస్తుశాస్త్రమునకు సంబంధించిన జ్ఞానములోను ప్రజ్ఞావంతులని సంస్తుతింపబడిరి. మఱియొకశాసనము వీరిని 'దశక్రియా' పరిజ్ఞాతలని పొగడుచున్నది.[1] నగర, గ్రామ, దుర్గనిర్మాణములు, జలనిర్గమనాగమనాది నిర్మాణములు, దేవాలయ, గోపుర, తటాకాదినిర్మాణములు వీటి అన్నిటియందును వీరు ప్రవీణులై దేశముయొక్క కళాసంపదను ఇంపొందజేసిరి. ఎల్లోరాగుహాలలోని కైలాస సౌధాదులు, మామల్లపురమునందలి ధర్మరాజాదులశిల్పరథాదులు, సాంచీ మున్నగుస్తూపరాజములు-ఇవియువియన నేల-ఇప్పటివఱకు దేశమునందు నిలిచియున్న శిల్పకళాసంపదయంతయు ఈపంచాణంవారు తమపోషణ రక్షణముల క్రిందికివచ్చిన శిల్పకళను ఎంతభద్రముగా కాపాడి, దానిని ఎంత చక్కనిస్థితిలో వినియోగమునకు తెచ్చిరో వెల్లడించు మహాత్కృష్ట నిదర్శనములుగ నున్నవి. ఇప్పటికి నీపైనుడివిన నిర్మాణములందలి శిల్పకళాకౌశలమును జూచి, యానందించి తలయూపనివాడు లేడు. అట్టిది ప్రాచీనార్య సంప్రదాయములో పెరిగి కులవిద్యలలో నారితేరిన విశ్వకర్మకులజుల యద్భుతకళాకౌశలము!

శిల్పకళాగౌరవము, చారిత్రకోదాహరణములు

ఇట్టిసిద్ధహస్తులైన శిల్పాచార్యులను విమతస్థులేకాక శత్రువులుకూడ గౌరవించి యాదరించు చుండువారు. హిందూదేశైశ్వర్యము నపహరించుటకై పెక్కుతడవలు దండయాత్రలొనరించిన ఘజనీమహమ్మదు సుల్తాను హిందూ విగ్రహములను అసహ్యించుకొనినను వాటిని, వాటికొఱకు ఆలయములను తయారుచేయుటలో హిందూశిల్పులుచూపిన కళానైపుణ్యమునకు ఆశ్చర్యపడువాడు. మధురానగరమును ముట్టడించినపిదప, ఆనగరములోని భవనములయొక్కయు, నగరముయొక్కయు ఘనతను పొగడుచు ఘజనీనగరములోని తన ప్రతినిధికి నుత్తరమువ్రాసినట్లు మహమ్మదీయ చరిత్రకారుడైన ఫెరిష్టా తెలుపుచున్నాడు. "మహమ్మదులవారి మతమువలెనే సుస్థిరమైన వేలకొలది దివ్యభవనము లిచటకలవు. ఎన్నియోలక్షలకొలది కోట్లకొలది దీనారములను వ్యయపఱిచిననే కాని యీనగర మిప్పటిమహోన్నతస్థితికి వచ్చియుండుట యసంభవము.

1. Ep. coll. No. 188—1909

అంతేకాదు; మఱల తిరిగి రెండువందల సంవత్సరములలోనైనను ఇట్టినగరమును నిర్మించుటకుకాదు." అని సుల్తాన్ మహమ్మదువ్రాసెనట.[1] ఈసుల్తాను ఘజ్నీకి తిరిగివెళ్లినప్పుడు ౫,౩౦౦ మంది హిందువులను ఖైదీలుగ గొనిపోయెను. వీరిలో చాలమంది శిల్పులు, వృత్తివిద్యా నిపుణులు నుండియుందురనుటకు సందియములేదు. ఏలయన గాంధార దేశములో నీసుల్తాన్ మహమ్మదు రాజధానియైన ఘజ్నీలోనున్నన్ని ప్రాసాదములు, దివ్యభవనములు, జలాశయములు, కేళీగృహములు, మంటపములు- ఈ మొదలగునవి ప్రాగ్దేశనగరములలోదేనిలోను గాన రావనియు, వీటినన్నిటిని నిర్మించినవారు హైందవ శిల్పులే యనియు తెలియుచున్నది. తైమూరు క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దము కడపట హిందూదేశముపైదండెత్తివచ్చి డిల్లీనగరమున లక్షలకొలది జనులను దారుణవధపాలుచేసి, పిదప చాలమందిని ఖైదీలుగపట్టుకొనెను. వారిలో శిల్పులు మొదలగు కళాకుశలు రెందఱుండిరో లెక్కవేయించి, వారిని తనరాజధానియైన సమర్కాండునకు గొనిపోయి, వారిలో చాల గొప్పవారిని కొందఱిని అచ్చట నొకమసీదు కట్టుటకు తన యాస్థానముననుంచుకొని, మిగిలిన వారినందఱిని తనక్రిందిసామంతరాజులకు, అమీరులకు నొప్పగించి, వారిపోషణభారము వారిపై మోపెను. ఈవిధమున నెన్నియుదాహరణములనైన నొసంగవచ్చును. మహమ్మదీయులు హిందువులకపుడు శత్రువులయ్యు మతవిషయకదృష్టిని పగబూని హిందూవిగ్రహములను, హిందూదేవాలయములను భగ్నముచేయుచు వచ్చినను కళాకుశలుర కౌశల్యమును మెచ్చకపోలేదు; మెచ్చి వారి నాదరింపకపోలేదు. ఇంతయేల, శత్రురాజులుహిందూదేశముపైదండెత్తివచ్చినపుడువారిశిల్పకళారచనలనుజూచి ముగ్ధులై అట్టి శిల్పవిద్యా వాచస్పతులను తమతమ దేశములకుగొనిపోయి గౌరవసమ్మానము లొసంగి వారి శిల్పకళారచనలకు ప్రోత్సాహ మిచ్చియున్నారు. అందువలన హైందవశిల్పకళ దేశదేశములకు ప్రాకి అచ్చటచ్చటనలసలను ఏర్పాటుచేసికొనెను. తుదకు బాగ్దాదునగరమును కట్టినదికూడ హైందవశిల్పులేయని తెలియుచున్నది.

### స్వదేశప్రభువుల కళాభిమానము

శత్రురాజుల మాటయటుండ దేశీయులైన రాజాధిరాజులు కూడ కళలనాదరించియుండిరనుటకు పెక్కునిదర్శనములు కలవు. అట్టివొకటిరెండు నుడివిన జాలును.[2] "అశోకవర్ధనుని కాలమున శిల్పులొకవిధముగ రాజుకొలువులోనివారుగనే పరిగణింపబడుచుండిరి. చేతులుపోగొట్టికాని, కళ్లుపోగొట్టికాని,...... వృత్తివిద్యావిశారదుని శక్తి సామర్థ్యములను కుంటుపఱిచినవారికి శిక్షశిరఃఖండనమే. నౌకానిర్మాతలు, కవచ (armour) నిర్మాతలు వేతనములనుబడయురాజసేవకులుగనుండిరి. వారు రాజుకేకాని యితరులకు పనిచేయగూడదను నిర్బంధ ముండినట్లు చెప్పుదురు. వడ్రంగులు, కమ్మరులు మొదలగువారిని రాజుప్రత్యేకము

1. Ferishta, Brigg's Translation. Vol 1. p 59.
2. V· A· Smithi's Early History of India , p.

కనుగొనుచు తణిఖీచేయుచుండువాడు." ఢిల్లీ పాదుషాయైన అక్బరుకాలువులో పెక్కురు కళాకుశలురు, వృత్తివిద్యానిపుణులు నుండు వారనియు, వారివారి రచనలలో అత్యుత్తమ ములైన వాటికి ప్రత్యేక బహుమానముల నొసంగి పాదుషా వారిని గౌరవించుచుండు వాడనియు అతని మంత్రియైన 'అబుల్ ఫాజల్' 'అయిని అక్బరీ' అనుగ్రంథమున వ్రాయుచు న్నాడు.

ఈపైనొసంగిన యుదాహరణములనుపరి శీలించినచో దేశీయులైననేమి, విదేశీయులైన నేమి ప్రభువులగువారు ఇట్టి విద్యావంతులను ఆదరించి గౌరవించి, వృత్తివిద్యలను కళలను పోషించువారనియు, పరరాజులు దేశమును జయించినప్పుడు చతురులైన శిల్పాచార్యులను, శిల్పాచార్య విరచితములైన కళాకావ్యరచన లను తమదేశమునకు గొనిపోయి తాము జయించిన రాజులను పరాభవించువారనియు తెలియుచున్నది.

ఇట్లే కర్ణాటసార్వభౌముడైన కృష్ణదేవరా యలుకూడ ఉదయగిరిదుర్గముపైకెత్తివెళ్లి దా నినిపరిపాలించుచుండిన గజపతిరాజులనుజయిం చి యాకోటలోనియొక దేవాలయమునయున్న యత్యంత సుందరమైన బాలకృష్ణమూర్తివిగ్ర హమును పెల్లగించి తనరాజధానియైన విజయ నగరమునకు గొనిపోయెను.

ఉపసంహారము

ఈపై విషయములన్నియు హైందవులై ననేమి, హైందవేతరులైననేమి, మనపూర్వుల కుగల కళాభినిరతిని సహస్రకంఠముల నుచ్చై స్స్వనమున నుద్ఘోషించుచున్నవి. అరితేరి, సిద్ధ హస్తులైనశిల్పులు, స్థపతులు మొదలగు కళా కుశలురు దేశమునకు కీర్తితెచ్చు నలంకార ములనియు, వారే దేశముయొక్క సంపదయని యు, వారులేనిదేశము—అనగా లలితకళాభి వృద్ధి-శిల్పకళావిజ్ఞానము- వర్ధిల్లనిదేశము దేశ మేకాదనియు వారు భావించియుండిరని పైవి షయములవలన విశదమగుచున్నది. తుదకు తంజావూరు, మధురానగరములు రాజధాను లుగ పరిపాలించిన నాయకరాజులు కూడసుప్ర సిద్ధులైన శిల్పాచార్యులను పోషించి, కళలను వృత్తివిద్యలను ఆదరించిరనుటకు వారికాల మునవిర్మింపబడిన గొప్పగొప్పదేవాలయాది నిర్మాణములే తార్కాణము.

ఈసంగతులన్నిటినిబట్టిచూడగా పూర్వ ము ప్రభువరేణ్యులు అగ్రహారముల నొసంగి బ్రాహ్మణవిద్య నెట్లాదరించిరో, బహుకళాకా వ్యరచనలు చేయించి వృత్తివిద్యా విశారదుల నుకూడ నట్లేసమానముగనే బహూకరించిరని స్పష్టపడగలదు. బ్రాహ్మణునిచేతిలో మతవిద్య యెట్టియాధ్యాత్మికపుటౌన్నత్యమున నందెనో అట్లే పారిశ్రామికునిచేతిలో వృత్తివిద్యయు కళాభిధానమును పొంది మహోత్కృష్టదశ నందివిరాజిల్లెను. ఈరెండువిధములైనవిజ్ఞానము నెంతటి యౌన్నత్యదశ నందినను దానికి గ్రామ మే ప్రాథమిక క్రీడారంగము. పల్లెటూరిపారిశ్రామి కుడు తనకర్మశాలలో వెలిగించిన యీ విజ్ఞాన జ్యోతి దేశాంతరములను కూడ ప్రకాశవంతము చేసి, సౌందర్యరససృష్టికి పరమావధి యయ్యెను. అట్టిది మనపూర్వపు వృత్తివిద్య, అంతటి నిరాడంబరమైనది తద్ విద్యా విధానము; అంతటి ఉత్కృష్టమైనది దాని ఫలితము.



అంగుళిమాలాస్తూపము

(శ్రావస్తి)



(పక్కీకూటి ప్రస్తుత నామము.)

# అంగుళిమాలాస్తూపము.

శ్రావస్తి



(పక్కీమాటి ప్రమాణములు)

ఈ పేరుగలుగు గ్రామనామము లింకను గొన్ని గలవు. ఈ బ్రాహ్మణక్రాక సమీపమున చినక్రాక, క్రాకుటూరు, తిరువళ్లూరి సమీపమున "క్రాకవాక" ఇత్యాదులు. బహుశః కాకినాడ "క్రాకనాడు" యొక్క వికారమైయుండునా? ఔపాసనాగ్ని ధూమముచే నల్లబడిన యిండ్ల కప్పులు కలది యగుటచే నగ్రహారమునకు "నల్లిండ్లు" అను పేరు వచ్చినట్లు శబ్దరత్నాకరమున గలదు. అగ్రహారమును "నల్లిండ్లు" అనుటకు యఱ్ఱాప్రగ్గడ హరివంశపూర్వభాగమున ప్రథమాశ్వాసమున నొక ప్రయోగము గలదు. మైలారుచరిత్రమునందు నొక యుదాహరణము శబ్దరత్నాకరమున జూపబడియున్నది. ఈవిధముననె శ్రోత్రియాగారములయందు త్రేతాగ్నులచే క్రాకుమండు నిండ్లు గలిగియుండుటచే క్రాక యని పేరు గలిగి యుండునా? "క్రాంకు" ధాతువు ననుసరించి "క్రాంక" యేర్పడినటుల శబ్దరత్నాకరము దెలుపుచున్నది.

ఈశాసనములో ఈగ్రామము హద్దులచే నిర్దేశింపబడియున్నది. ఆహద్దులు యిప్పటికిని గొన్ని కలవని యచటివారు చెప్పుదురు. ఈహద్దులకు వాడుకలోనుండు పేళ్లే చెప్పబడినవి. ఇటు లనేకశాసనములందు గలదు. ఈ గ్రామనిర్దేశము చేయుటలో "జలదంకియామ్యే" యని యొకస్థళ నిరూపణము చేయబడియున్నది. ఆప్రాంతకాలమున "జలదంకి" యొక గొప్పగ్రామముగనుండి యందొక పాళెగాడు "సామంతుడు" యుండినటు లున్నది. ఈ జిల్లాలోని కోవూరుతాలూకా వెలిచర్ల శాసనమునను "జలదంకిస్థళే పాంకనాండి సీమ్ని" యని యున్నది.

"ప్రోక్తాః పంచ యుతా షష్టి బుక్కరాయ పురాధిపాః" యని శాసనాంతిమభాగమున నుండుటచే ఈ యగ్రహారము అరువదియైదు భాగములు జేయబడి దానమియ్యబడినటులు స్ఫురించుచున్నది. ప్రతిగ్రహీతృనామములు అరువదినాలు గగపడుచున్నవి. ౫౯-వ శ్లోకమునను అరువదినాలుగు చెప్పబడినవి:—

"అంశాస్తత్రచతుష్షష్టి" శాసనపు కడభాగమునను
"భాగా బుగ్వేదినాం సార్థ త్రయోవింశతి రీరితాః
"యజుర్వేదాం పునస్సార్థ షట్త్రింశ త్పరికీర్తితాః
"ద్వౌ సామవేదినౌ ర్భాగౌ ద్వౌభాగౌ శేశవేశయోః
"ఏవంభాగా శ్చతుష్షష్టిరేవ" యనియే యున్నది.
ఈ అరువది యైదవభాగ మెవరికో స్పష్టపడలేదు. బహుశః గ్రామాధికారులదిగ నుండును.

ఈ శాసనమందలి విశేష మేమనగా:—ఋగ్యజుస్సామవేదులు ముగ్గురికి అంశముల నిచ్చుటయే కాక, దానముగొనిన ఒక్కొక్కరియం దొక్కొక్క సాధ్యముగూడ జెప్పబడియున్నది. వేదశాస్త్రపారగులుగను బ్రాహ్మణ్యనిధులుగ నుండువారుగాక ఆయుర్వేదవిదులకును, జ్యోతిశ్శాస్త్రవేత్తలకును విద్యానిధులకును ద్వైతాద్వైత తత్త్వజ్ఞులకును వారివారి యధికారములనుబట్టి దానము లీబడినవి. నృహరియను నొకరు అద్వైతద్వైత సదనుడని ప్రశంసింపబడియున్నారు. నాగదేవపుత్రులు రామాచార్యులవారు "ద్వైతధూయజుషాం గృహం." హీరుమాధ్వసంప్రదాయములోచేరి వారుగనుండురు. ఇంతియకాక "ప్రథమాశాఖభూషణా" యనెడు "ధైర్య భూమి" యొక్కడు "మంత్రవేద" యొక్కడు "సదీశ్వరు" డొక్కడుగూడ ఈ యంశభాగ్యులలో గలరు. ఇట్లు వేదశాస్త్ర మంత్ర తంత్ర కళా వైద్య జ్యోతిష కవిత్వాభిమానముల యౌగపద్యముగ జూపిన శాసనము లితరములు గలవా యని సందియముగ నున్నది.

ఈ యన్నిటికంటెను గొప్పవిశేష మేమనగా: వేదభాష్యమును రచించిన సాయణాచార్యులవారు ఈ బ్రాహ్మణక్రాకలోని యొక అగ్రహారికుడని తెలియుచున్నది.

"మోభాష్యకృద్ధీమాన్ సాయణాచార్య సంజ్ఞకః,
అసౌ శ్రీసాయణాచార్యో భారద్వాజో యజుర్నిధిః;
పదవాక్యప్రమాణానాం ప్రధానం యజుషాం పదమ్."
అని శ్రీసాయణాచార్యులవారి ప్రస్తావ మిందు గలిగి యున్నది. దీనినిబట్టి సాయణమాధవుల కాలనిర్ణయము మొదలగువంశముల కాధారము గలుగవచ్చును. వీరి కాంధ్రదేశ సంబంధ మేర్పడుచున్నది.

అథర్వణశాఖవా రాకాలమునకే లోపించిరి కాబోలు! అట్లుకాకున్న ఆ శాఖవా రొక్కరైన యిందు చేర్కొనబడియుందురు. ఆ వేదమునకును సాయనభాష్యము గలదు.

ఋగ్వేద మాయణసుధీ ర్విశ్వామిత్రస్య గోత్రజః।
ప్రథమామ్నాయపారీణః ప్రశమాధరణావ్రతః॥
భారద్వాజో దేవణార్య సుతో మాయణకోవిదః
యశ్శాబ్దికాగ్రణీ స్తర్కవిద్యావిశాల మృచాంపదం॥
కాశ్యపః పెద్దభట్టోఽసౌ చాంబిభట్టతనూభవః।
ఋగ్వేదీ తద్విధానజ్ఞో తల్లక్షణవిహారకః॥
రామయార్యసుతో రామో భరద్వాజోఽన్వవాయో
దయః।
ఋగ్వేదజన్మభవనం భవనం శాస్త్రసంపదాం॥
భరద్వాజ శ్శాంబయార్య స్సోమసూరివరాత్మజః।
ఋగ్వేదనిధి రాత్రేయ స్సచ్చరిత్రవిభూషణః॥
కేశవః కరుణాభూమిః కురవప్పయ్యనందనః।
ఆహు ర్యమస్వయం తజ్జ్ఞా ఋచా ముత్పత్తికారణం॥
మాధవార్యసుత స్సోఽయం గౌతమ స్తిప్పయార్యభూః।
ఋగ్వేదవేదనా మాన్యః కేశవార్యతనూభవః॥
ఆంగీరసగౌత్వేతగోత్ర స్సింగయ్య కోవిదః।
ఋచాం ప్రధానపదవీ విష్ణుభట్టస్య నందనః॥
విశ్వామిత్రః కొల్లిదేవ సుధీ స్సుకృతినాం వరః।
సుధీ రధీతవేదాంత స్సోఽప్పార్య తనూభవః॥
శ్రీవత్సగోత్రసంభూతో హనోన్నప్పార్యఋచాంపదం।
వశిష్ఠపుత్ర, మామ్నాయో విద్యాధరబుధాత్మజః॥
కృపానిధి శ్శింగ్రపసూరిః కాశ్యపాన్వయసంభవః।
శింగయార్యసుతో ధీమాన్ భారద్వాజాన్వయోద్భవః॥
ఋగ్వేదీ కరుణాసింధుః పోచనార్యో మహాయశాః।
వాసిష్ఠః పిన్నయార్యాత్మజాతో జాతకృపాంతరః॥
అంతరాసక్త నృహరి నృహరి ర్మూర్తి రిహ న్నృచాం।
యజుర్వేదా మగ్రసరః తద్విధానవిధా మపి॥
గౌతమో భైరవ స్సోఽయం పెద్దసూరితనూభవః।
అధీత ప్రథమామ్నాయ శ్శ్రౌతశాస్త్రకళానిధిః॥
కౌండిన్య స్సింగయసుధీః భైరవార్యతనూభవః।
విధిజ్ఞో విద్యానందో విశ్వామిత్రకులోద్భవః॥
చాంబిభట్టసుతో విద్వాన్ ఋగ్వేదీ అన్నపాభిధః।
ప్రధాన మృగ్వేదాంసాత్రం పరం సుకృతిసంహతేః।
కాశ్యప శ్శింగయ శ్శ్రీమా నృప్పవిశాల నందనః॥

విశ్వామిత్రః పవిత్రాంతః పుత్రోఽన్నయమనీషిణః।
ఆధార స్సంవిధానానా మృచా మన్నయకోవిదః॥
ఆత్రేయగోత్ర స్సన్నైత్రిపాత్ర మృగ్వేదపారగః।
నరసింహో మహాప్రాజ్ఞో నారాయణబుధాత్మజః॥
భారద్వాజాన్వయజనిః పోచనార్యతనూభవః।
ప్రథమామ్నాయపదవీ శ్రీమా నప్పయకోవిదః॥
ఋగ్వేదా మగ్రణీ రగ్రగామీ శాస్త్రకళావిదాం।
శ్రేయోనిధి ర్దేవణార్య శ్శ్రీసుతో న్నాగపార్యజః॥
యదీయమానసే సాంగ మృగ్వేదం పరిజృంభతే।
సహాయసం పెద్దసూరిః కాశ్యపశ్శాంబపార్యభూః॥
ఏతే ప్రత్యేకమంశేశాః అర్ధార్ధాంశాధినాయకాః।
గోపాలసూరితనయ శ్శ్రీమా నృగ్వేదపారగః॥
వాత్సల్యగోత్రజో విద్యాగ్నిమణోఽర్ధాంశకాధిపః।
ఏవం సమ్మిశ్రితా స్సార్ధత్రయోవింశతి రంశకాః॥
యో వేదభాష్యకృద్ధీమాన్ మాయణాచార్యనందనః
అసౌ శ్రీసాయణాచార్యో భారద్వాజో యజుర్నిధిః॥
పదవాక్యప్రమాణానాం ప్రధానం యజుషాం పదం।
ఆత్రేయసూరి స్సూరింప్రసూను ర్విశ్వేశ్వరో బుధః॥
శ్రీకాంత మాచిభట్టార్య తనూజ స్తర్కతంత్రభూః।
కాశ్యపో యజుషాం శ్రీమాన్ రామచంద్రో బుధాగ్ర
అద్వైతాద్వైతసదనం సదనం యజుషా మపి। [ణీః॥
నందిసూరిసుతో విద్వాన్ నృహరిః కాశికాగ్రణీః॥
యజుర్వేదా మగ్రసరః శ్రౌతశాస్త్రవిదామపి।
హరి స్సూరిభట్టస్య సూను ర్రెల్లయకోవిదః॥
నందనో నాగదేవార్య స్సాచలానందవత్సలః।
రామాచార్యో భరద్వాజో ద్వైతభూ ర్యజుషాం
గృహం॥
ఆయుర్వేదవిదాం శ్రీమాన్ యజుర్వేదవిదాగ్రణీః।
శ్రీవత్స శ్శ్రీగిరి ర్విద్వాన్ శ్రీవల్లభబుధాత్మజః॥
అధీతయజురామ్నాయో బోధాయనసూత్రే స్మృతిః।
విద్యాన్నరహరి ర్జామదగ్న్య వత్సాన్వయోద్భవః॥
జ్యోతిశ్శాస్త్రం యజుర్వేదో యదన్వయవిభూషణం।
సవిశ్వనాథతనయో గార్గ్యో మల్లయ కోవిదః॥
అన్నయార్యసుతో విద్వా ననంత శ్శాంతిమానసః।
కళానిధి ర్యజుర్వేదీ కాశికాన్వయసంభవః॥

శ్రీపాదకమలోద్భూతా విభాతి విబుధాపగా।
యస్యాస్సా కేశవ శ్రీమాన్ ఏతద్గ్రామాధిదైవతః॥
రామేశ్వరో రాజమౌళిః రామచంద్రప్రతిష్ఠితః।
సోమోఽసౌ విభాతి గౌరీశో ఏతద్గ్రామాధిదైవతః॥
ఏతౌ ప్రత్యేకమంశౌ ద్వావుక్తౌ కేశవేశ్వరౌ।
భాగా ఋగ్వేదినాం సార్ధత్రయోవింశతి కీర్తితాః॥
యజుర్వేదాం పునస్సార్ధ షట్త్రింశత్పరికీర్తితాః।
ద్వౌ సామవేదినో ర్భాగౌ ద్విభాగౌ కేశవేశయోః॥
ఏవం భాగా శ్చతుష్షష్టి రేవ గ్రామ్యాగ్రహోఽస్య సః।
ప్రోక్తాః పంచయుతాష్షష్టి బుక్కరాయపురాధిపాః॥
సాష్టైశ్వర్యస్సాష్టభోగాః సానందా దార్యమాసనే।
సర్వమాన్యం మాగిరారస్యాష్ణో యం పరిసేవితం।
న సంఖ్యాతుం నిర్దేష్టుం శంకతే రాజపూరుషః॥
ఇత్యేతే శంకరా స్సర్వస్వమంగళాస్సన్నిమందిరః।
విజయంతేతరాం విప్రా బుక్కరాయపురేఽనిశం॥

ప్రాగ్దగగ శ్రీశివరానిన సాభిలాషా
స్వద్యాత్మకరః కవివరానినసానుబంధాన్।
శ్రీబుక్కరాయపుర మేత ద మూన్ద్విజేంద్రా
నానందయత్వనుకులం సరసాభిరామం॥

సామాన్యోఽయం ధర్మసేతు ర్నృపాణాం
కాలే కాలే పాలనీయో భవద్భిః।
సర్వానేతాన్ భావినః పార్థివేంద్రాన్
భూయోభూయో యాచతే రామచంద్రః॥

బహుభి ర్వసుధా దత్తా రాజభి స్సగరాదిభిః।
యస్యయస్య యదా భూమి స్తస్య తస్య తదాఫలం॥

దానపాలనయో ర్మధ్యే దానాచ్ఛ్రేయోఽనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం॥
శత్రుణాపి కృతో ధర్మః పాలనీయః ప్రయత్నతః।
శత్రురేవ హి శత్రుస్స్యాత్ ధర్మశ్శత్రు ర్నకస్యచిత్॥
స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరాం।
షష్టిర్వర్షసహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః॥
సహస్రేణ తటాకానా మశ్వమేధశతేన చ।
గవాం కోటిప్రదానేన భూమిహర్తా నశుధ్యతి॥
ఏకైవ భగినీ లోకే సర్వేషాం భూభుజా మపి।
న భోగ్యా న కరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥
శ్రీమద్రామానుకథాప్రధానవిబుధా
శ్రీపాదపద్మాత్మనా।
శ్రీమద్రామానుకృపావిలాసవిలస
ద్విద్యానవద్యాత్మనా॥
శ్రీమత్తోప్యనసూరిణా విరచితం
సత్సూక్తి ముక్తాన్వితం।
శ్రీమచ్ఛాసనమేతదత్ర జయతా
దాచంద్రమాతారకం॥
ఏతస్మి న్నగ్రహారే హరిహర ధరణీ
పాల దానాంబురాశే
రుత్పన్నే ఽతీవరమ్యే స్ఫురదురు మహిమా
వారణసీమాభిరామే।
సద్వృత్తే సత్క్రియాశేసతతగుణయుతే
సత్వసంసంశ్రితానా
సంతానానాం నాయకాయాఽవనిసురనికరా
యాస్తు రాశాప్రశస్తం॥
శ్రీ విరూపాక్ష





# వనలక్ష్మీ సమాగమము

గుళ్లపల్లి నారాయణమూర్తి గారు

ఎన్ని భవములఁగల్గు వనేందిరాస
మాగమసుఖం బనంతనిర్మలసుధాభి
షేచనము కాదె? ఈశుష్కజీవి కద్ది!
వేకువను నిద్రమేల్కాంచి వెడలి చేసి
నాడ నొక రసాలవనసందర్శనంబు.

తొలికృశించియు, సన్నమై, మెలికలంబడి,
రానురాను విస్తరిలి, భూరమణి వేయు
కీలుజడభంగి, పూర్ణవినీలనీర
ములనొసంగుచు నాచూతఫలతరులకు,
నవ్యభావ ప్రబోధనానైపుణీవి
లాసముల నొప్పు బాలతరంగమధుర
నిస్వనాలాపముల స్వాగతస్వరాళి
బాడె, సెలయేటికన్నె, ప్రాపంచికవ్య
థాదవానలతప్త చిత్తంబునకును,
నవరసాలపల్లవ భోజనం బొనర్చి,
అభ్రచుంబిత శాఖాగ్ర మధివసించి,
ధాతృవదన విముక్త వేదములనెల్ల
మంజుల సుధారవంబున మార్చి వైచి,
చిలికి, కల్పించె, పికమాని జీవితాశ;
ఫుల్లవికసిత కుసుమ సంపూర్ణగుచ్ఛ
తాళవృంతంబులను దమతావులెల్ల
నాపయికె వీచె, చెంగులాబీపడంతు
లట్టె యిరువెసల న్నిల్చి, ఆలదేమేన
చందన ద్రుమాంగన నిజసౌరభముల,
తుమ్మపూగొమ్మ మేనపుష్పమ్ములెల్ల
రాల్చియొనరించె పీతాంబర ప్రదాన;
మంత మందార కుసుమాంగి యౌవనము
రేకొకటియుంచి కల్యాణరేఖగూర్చె;
అలుముకొన్న శిరీషసుమపంకిలమునాద
ములకు లత్తుకపూతయై, ముక్కువృద్ధ
నారికేళాంగనకు; శోభన ప్రధాన
శయ్యకై యూడకంబముల్ సాచి పాతి,
పందిరిని వైచి, పచ్చికపరుపు సిద్ధ
పరచిన వటవృక్షచ్ఛాయ కరుగుచుండ
దర్శనమొసంగెను రసాలతరునవోఢ
మాధవీలతాంబరము రమ్యముగ దాల్చి
గంధవాహుని కొకవంక గన్నుగుట్ట
స్కంధమున ఫలగుచ్ఛకుచంబు లదర
సిగ్గుచే నగ్రశాఖాంక శిరము వంచి
ప్రమద మొనగూర్చె; నెన్నిభవములకల్గు
నవయుషఃకాలశోభ ప్రాణప్రతిష్ఠ
కల్గువనలక్ష్మితో సమాగమసుఖంబు



